# మందిమన్నియమ్

## 1. అవతారికా ప్రకరణము

### -: మంగళాచరణము :-



వనితా గవేషణ వి । శేష మిషౝ వెలిదీవి వీడి యీ/ భూవల
యంబు సొచ్చి వృష । భూధరమం దుదయించి మించి యాం,
ధ్రావళి యాత్మతేజమున । రాజిలఁ దద్వితతంపు నీడ లో
కావరణంబుగాఁ జేలుపు । నాపదమ్రొక్కులవాఁడు కావుతన్. 1

### -: ఇష్టదేవతాప్రార్థనము :-

చం. జనకలుషంబులన్ హుతముఁ । జేల్పుటకే తన యగ్నిహోత్రముల్ ;
మనుజ మనో మదాంధతల । మర్దనకే తన ఛద్మపైత్యముల్ ;
తన తిఱిపెంబు భక్తజన । దైన్యములన్ వదిలించు పొంటె ; ని
ట్లనితరసాధ్య చిత్ర చరి । తాత్మకుఁ గొల్చెద షిర్డి సాయినిౝ. 2

ఉ. తాను సమస్త విశ్వమున । సన్నిధి సేసిన శక్తిరూప ; నృ
జ్ఞాన హృషీకముల్ తెలియఁ । జాలిన యావదజాండవస్తువుల్
తానె ; ప్రపంచమందుఁ బ్రమ । దా సముదాయ విభాయి మాయ తా
నే ; నతి సేసెద న్నెఱిఁగి । నే నుతి సేసెద నమ్మ దుర్గకుౝ. 3

### -: గురుజనాభివందనము :-

కం. బహుసంఖ్యులు బహుమాన్యులు
బహుళప్రతిభా పరీత । భావనులు వచో



గహనావగాహు లస్మ
న్మహితాచార్యులు నమోన్న । మహ వారలకుౝ. 4

ఉ. కొండికనై బడిౝ దొలుతఁ । గూడిననాఁడు తెలుంగు వర్ణముల్
దండిగ దిద్దఁబెట్టిన యు । దార మనీషిణి యెవ్వటో మదిౝ
మెండుగ గుర్తురా దకట ! మేఱలు లేని విశుద్ధ భక్తి లో-
నిండఁగ నాదు జ్ఞాన జన । నిం బ్రణమిల్లెదఁ గోరి దీవెనల్. 5

తే.గీ. వాఙ్మయ ప్రముఖుండు శై । వాభిముఖుఁడు
వందనీయుండు ముదిగొండ । వంశకరుఁడు
వాసుదేవ సముండు శి । వ ప్రసాదు
బ్రహ్మసముఁడు నేతి అనంత । రామశాస్త్రి. 6

తే.గీ. పాలమూరి భూస్వామి కృ । పాపరుండు
శివ సమానుండు శ్రీ నర । సింహరెడ్డి
ముగ్గు ఱాంధ్రానఁ బ్రత్యక్ష । ముగ గురువులు
వందలాదిగ వారికి । వందనములు. 7

తే.గీ. పండితాగ్రణి పేరాల । భరతశర్మ
విమలమతి కప్పగంతుల । కమలగారు
మేటి యానందతీర్థ వ । ఖేటకరులు
నాకసారస్వతంబున । నాకు గురులు. 8

తే.గీ. సాహితీ పరిశోధన । సరణులందు
గురువులు గిరిప్రకాశులు । మఱి జయప్ర
కాశు, లాంగ్లమునందు సో । మేశు లోజ్జ
లందఱ కివియే పాదాభి । వందనములు. 9

మ. దయకున్ క్షీరసముద్రముల్ చరణ పా। తైక ప్రసన్నుల్ జగ
న్నయముల్ నేఁటిని ప్రాఁతకాలపు జనుల్। నా యొజ్జే ; లింకన్ స్తనం
ధయమే నా మతి వారి పావన పదా। ధారంబులన్ ; గాఁచు వా
రి యెడన్ నా యవిధేయతన్ గరుణతో। శ్రీ సాయినాథా ! వెసన్.

చం. తెలియని యర్థముల్ మదికిఁ। దెల్లము సేయుఁడు, నా విలోకనం
బులు ప్రసరింపనట్టి పలు। మూలలఁ జీఁకటి కూణరాశిపై
వెలుఁగులు వార్చుఁ డొజ్జలు ! వివేక మయోక్తులతో మదీయ సం
కలనము నెల్ల శ్రోత్ర సుభ। గం బనటింపుఁ డటంచు వేఁడెదన్. 11

-: కృతికర్త వంశవర్ణనము :-

సీ. ఎవ్వారి భారతి। కవ్వారిగాఁ గల్గె
భూదేవి శ్రీదేవి। భువనకీర్తి
యే పూతవంశంబు। శ్రీపాద వల్లభు
చెలియలు మెట్టుటన్। జెలువుమీఱె
నెం దుద్భవించెను। జెందోలు దేవుండు,
రాఘవ నారాయ। ణాఖ్య శాస్త్రి
యెక్కుటుంబమువారు। పెక్కు శతాబ్దులై
గుంటూరి సీమలోఁ। గుదిటికొనిరొ
తే.గీ. యట్టి హారీత ఋషిగోత్రు। లతిపవిత్రు
లసిత యాజుషీయులు నిర। తాగ్నిహోత్రు
లత్రిగుణులు నాపస్తంబ। సూత్రులు నగు
వెల్లనాఁటి తాడేపల్లి। వైదికులకు. 12

చం. తృణజలకాష్ఠ సిద్ధి, ధన। ధాన్య సమృద్ధియుఁ గల్గు గర్తప
ట్టణ భువి మట్టిపూడి యను। ధారుణిదేవుల యగ్రహారమం



దణఁకువ రాజేలిచ్చిన శతాల కొలం దెకరాల్ భుజించుచున్
తొణఁకక పల్ శతాబ్దములు త్రోసిరి లిప్తగ ; నంత వారిలోన్. 13

మ. దెసలం బర్వ స్వకీర్తిచంద్రికలు, తా। డేపల్లి లక్ష్మీ నృసిం
హ సమాఖ్యాతుఁడు పుట్టి వల్లభ మనో। హ్లాదైక పూజా తపో
విసరన్ కాంతమ నామ్నిఁ జేకొని కడున్। వేచె న్నపత్యార్థమై
వెస నండూరు నివాసి దత్తుగొనియెన్। వేమూరి శ్రీరాములన్. 14

కం. శ్రీరాములు సనుదెంచిన
సార సమయమేమొ వారి। జేంటకు ముదిమిన్
దారకుఁ డొకఁ డొదవె సదా
చారుఁడు సుందరకరామ। శాస్త్రి యనంగన్. 15

ఆ.వె. సుచిర మాయుషంబు। సుందరరామయ్య
బ్రతుకఁడయ్యె జన్మ। పాండురోగి
యిఱువదేండ్ల నాఁటి। కరిగె దివిజభూమి
లోఁకువనుచు మనుజ। లోకభూమి. 16

ఉ. పద్మదళ స్థితంబగు న। పాంకణమట్లు మెలంగుచుం గలి
చ్ఛద్మ విదూరుఁడై కలిమి। చే నవలిప్తుఁడు గాక భారతీ
సద్మనిభుండు నేర్చె బహు। సాహితి శాస్త్ర కళాగణం బన
ర్ఘ్యద్మరుఁడైన దాతృమణి। రాములు శ్రీపదపూర్వకుండిలన్. 17

సీ. చేదివెను గీర్వాణ। సాహితి మద్రాసు
పట్టణంబున ఎమ్మె। పట్టమునకు
నాశ్రమంబునఁ జేరి। యాచార్యు శుశ్రూషఁ
గఱచె నాయుర్వేద। కౌశలంబు

నిష్ఠతో శోధించి । కుష్ఠౌషధముఁ దయా
రించి పంచె నది య । కించనులకు
ధన్వంతరీవైద్య । ధామంబులకు భూరి
దానంబు లసఁగి ప్రో । త్సాహమిచ్చె
తే.గీ. మేఘదూతంబుఁ దెనిఁగించె । మేల్తరముగ
వేంకటేశ్వర భక్తుల౯ । వేడ్కఁ గూర్చి
సమితి నెలకొల్పి భక్తిఁ బ్ర । చారపఱచె
దత్తసుతుఁడు శ్రీరాములు । ధరణిహితుఁడు. 18

మ. ఇడె నెన్నో యెకరాల కొద్ది పుడమి౯ । హిందూసమాజంబు వార్
విడిగాఁ బెట్టిన గర్తపట్టణ మహా । విద్యాలయశ్రేణికి౯ ;
జడలం దాలిచి నాటకంబుల నటిం । చె౯ సిద్ధపాత్రంబులం ;
దెడఁ జింతింప నెవండు వోలునొకొ తా । డేపల్లి శ్రీరాముల౯. 19

చ. చెఱువు కులీనఁ జంద్ర సరు। చి౯ మహలక్ష్మిని సార్థకాహ్వయ౯
గురుజనులాజ్ఞ నౌఁదలను । గూర్చి చేకొనె నాతఁడుం ; బర
స్పరమును వారు ప్రేమమునఁ బ్రబ్బిరి గంగయు శంతనుండన౯
దరమిడి పుత్త్రులిద్ద ఱక । తన్వియుఁ బుట్టిరి ; వారిలోపల౯. 20

మ. తొలిచూల్ బిడ్డఁడు వెంకటేశ్వరు లమం । దోత్సాహి బంధుప్రియుం
డలఘుస్నేహపరుండుఁ దండ్రివలెనే । యన్యోపకారుండు, ని
శ్చలహాసోక్తి పరుండు, విద్యకును బా । శ్చాత్యార్థతాధారి గ
ర్వలవాభావి, యగృధ్నుఁ డప్రచుర దై । వారాధనుం డిమ్మహి౯. 21

మ. చేదివె౯ బందరు భావగర్తపురుల౯ । జేట్టంబు వాణిజ్యము౯ ;
గదిలె౯బ్యాంకునఁ గొల్వుసేయుచుఁ దెలుం । గంబందుఁ బెక్కాళ్ళ
కు౯ ;



పెదవారల్ కుదిఱింప భానుమతిఁ దాఁ । బెండ్లాడెఁ జేల్లాన్వయ౯ ;
గుదురైనట్టి గృహంబుఁ గట్టి నిలిచె౯ । గుంటూరు పట్నంబున౯. 22

కం. హరికృష్ణుఁడు, రవిచంద్రుఁడు,
సురవాక్కుల కొజ్జే బాల । సుబ్రహ్మణ్యం
డిఱవుగ లలితాబిరుదుఁడుఁ
జరమమున౯ శైలజ యను । సంతతి నలువుర్. 23

మ. పనుపై వేలుపుచేఁ దృతీయుఁడగు సు । బ్రహ్మణ్యుడే వారిలోఁ
దెనుఁగు౯ సంస్కృత మభ్యసించి తెనుఁగుం । దేశంపుఁ బట్నానకు౯
బనిపై వచ్చి వసించుచుండె బహుళా । బ్దంబుల్ నిజైకైక స
త్తనయు౯ రాఘవసాయిఁ దోడ్కొని కళ । త్రంబైన వైదేహితో౯. 24

సీ. విబుధవాక్కులను శ్రీ । విష్ణులీలాస్తవ
మాచరించెను షోడ । శాబ్దులపుడు
శ్రీరామశతకంబు । శ్రీ వేంకటేశ్వర
శతక సింహాచలే । శ్వర శతకము
లత్రినందనము శ్రీ । అల్లమాలిక కృతిని
బదపడి కూర్చెను । ప్రౌఢిమమున
గారుడశ్లోకాల । కాంధ్రతాత్పర్యముల్
కావించెను సుబోధ । భావముగను
తే.గీ. హరువుగ సమాసకుసుమాళి । కాంగ్లభాష
సంతరించెఁ బ్రతిపదార్థ । సహితభాష్య
మాంధ్రమున వ్యాసరాజము । లధికశతము
భగవదనుకంప రచియించెఁ । బ్రకటపడఁగ. 25

కం. వివిధములు విస్తృతంబులు

నవిరతములు నవతమములు । నానావిషయ
ప్రవణములు వివరణములీ
కవి రచనలవి తనకే య । గమ్యములు స్మృతిన్. 26

-: కృతికరణ ప్రయోజనము :-

శా. భవ్యంబయ్యెను నవ్యమిప్పుడు ప్రజన్ । బాలించు పైనంబు ; తా
నవ్యాకారితమయ్యె శిక్షితులకై । నన్ జాల నజ్ఞాత ; మ
స్తవ్యస్తంబు నయోమయంబగు నను । స్థానంబునన్ మందికిన్ ;
గువ్యాఖ్యావిషమూర్ఛితంబిది తెలుం । గోర్వీ ప్రజాస్వామ్యమున్. 27

సీ. స్వాతంత్ర్యయోధులు । సాటించినదె ప్రజా
స్వామ్యమని తలంచే । వారు గలరు
పాశ్చాత్యదేశముల్ । పాటించేనదె ప్రజా
స్వామ్యమనియు నెంచే । వారు గలరు
ఎన్నికైన ప్రభుత్వ । మేమి సేసిన నదే
గణతంత్రమని చెప్పు । ఘనులు గలరు
ప్రజలడిగినయట్టి । ప్రతిదానినిన్ వారి
కందించేటయె ధర్మ । మండ్రు కొంద

తే.గీ.ఱెవటి స్వార్థేచ్ఛల ననుస । రించి వారు
మసలు హక్కే ప్రజాస్వామ్య । మని తలంచే
పశువులు శిశువులు గలరు । ఫలిత మాంధ్ర
నేల పిచ్చివారల వైద్య । శాల యయ్యె. 28

శా. జనతంత్రంబునకేది మూలము ? సమా । జంబందు సంస్థాగణం
బునకున్ దానికిఁ దత్త్వసూత్రపరమౌ । పొందేది ? యేయే వ్యవ
స్థ నిజాస్తిత్వము కోసమే నిజములా । ధారంబుగాఁ బూని తా



మను? నేతన్మితులేవి? యేవి తన స్వా । మ్యంబుల్స్వకర్తవ్యముల్?
29

కం. అని యొక మనోమయ చిరం
తన చింతన సింధునీర । ధారల కెఱటం
బనునిత్యము గర్జించేచే
జనహిత యోచనల నన్ను । జేడి ముంచెత్తెన్. 30

శా. అంతర్వాణిని వీనులొగ్గి వినుచున్ । నజ్ఞాతముల్ నేర్చుచున్
స్వాంతంబందు స్ఫురించినట్టి తలఁపుల్ । సాశ్చర్యునిం జేయ న
శ్రాంతంబు న్నవి సుందరాక్షరములన్ । సాకారముల్ సేయుచున్
స్వంతంబైన దొసంగులన్దుడుచేచున్ । సాఁగించితీ సేద్యమున్.31

కం. విన్నవియుఁ గలవు పెక్కులు
కన్నవియుఁ జేదివినవియును । గలవవి పెక్కుల్
విన్నాణ మన్యులదియున్
మన్నించేచే నైజతత్త్వ । మది నుడువఁబడెన్. 32

: ప్రకరణాంత గద్య :

ఇది సకలసూరిసమ్మతిపాత్ర,హరితసగోత్రపవిత్ర, శ్రీతాడేపల్లి భానుమతీ వెంకటేశ్వర పుణ్యమిథున తృతీయపుత్త్ర, శ్రీషిరిడీసాయి లలితా మహా మాతృ నిర్నిబంధ కృపాకటాక్ష వీక్షణైక సంపద్యమాన బహుభారతీ గాత్ర, లలితాబాలసుబ్రహ్మణ్యము రచించిన మందిమన్నియమను నభినవ రాజ నీతితంత్రమునం దవతారికాఖ్యమగు మొదటి ప్రకరణము.

# మందిమన్నియమ్

## 2. అవబోధ ప్రకరణము

శా. శ్రీరాజద్గణతంత్రపాలనవిధిన్ । స్వీయామలాలోచనా
చార స్థేమ నశేష భూవలయ రా । జ్య శ్రేణి కీనాఁడు స్వీ
కారార్థంబుగ సంతరించిన యనే । కాగ్రేసరత్వాల వే
ర్వేఱక్ విప్లవ వీరులక్ గవుల హృద్ । వీథిక్ బ్రశంసించెదన్.

***అవతారిక :*** *మందిమన్నియమను పేరు గల యీ నవీన రాజనీతిశాస్త్రము నధ్యయించేటకు ముందు దీని నాకళించికొనవలసిన పద్ధతిని గూర్చి యీ ప్రకరణములోఁ గ్లుప్తముగా వివరింపఁబడుచేన్నది.*

సూత్రము – 1 : **కార్యకారణ సామాన్యముల యర్థాశ్రయ విపుల వర్ణనము శాస్త్రము.**

**వృత్తి :** సామాన్యముగా అందటికిని అనుభవములోనికి వచ్చు కార్యకారణములను నిష్పక్షపాతముగాను, విశదముగాను వర్ణించేనది శాస్త్రము.

(అ) హేతువనఁగా ఫలిత పరంపరయం దేకదేశము.

సూత్రము – 2 : **శాస్త్ర మనుభవ సిద్ధము.**

**వృత్తి :** శాస్త్రము కడపటిది. అనుభవము తొల్లింటిది.

(అ) ఏ యొక్కటి యనుభవమును గాని త్రోసిపుచ్చేను వీలుపడదు.



(ఆ) శాస్త్రమునను సరించి యేదియు జేటుగదు. జేటిగినదానిఁ బట్టి శాస్త్రము తన సిద్ధాంతముల నేర్పఱచికొనును. లక్ష్యమును బట్టియే లక్షణమేర్పడును.

(ఇ) స్వీయానుభవమునకున్ను నిజపరిశీలనమునకున్ను విరుద్ధమైనది శాస్త్రము కాఁజాలదు. కనుక శాస్త్రానుభవముల మధ్య ఘర్షణ మేర్పడినప్పుడు మనిషి విస్తారమైన తన స్వంత యనుభవమునే విశ్వసింపవలెను.

(ఈ) ఎల్లఱున్ను ఎల్ల విషయములందును స్వీయానుభవము నార్జించేట వలనుపడదు. కనుక తమ పరిశీలనముతో సంపదించే ననుభవములు గలవారి సహాయమున శాస్త్రవచనముల సత్యాసత్యముల నెఱుఁగఁదగును. దీని కాప్తవచన ప్రమాణమని పేరు.

సూత్రము – 3 : **లోకమర్యాదల కతీతము.**

**వృత్తి :** శాస్త్రములోఁ జెప్పఁబడిన యపాక్షికాంశములు వ్యవస్థల నధిష్ఠించిన పెద్దమనుష్యులకుఁ గష్టమైనను నిష్ఠురమైనను శాస్త్రకారు లుదాసీనులు.

(అ) శాస్త్రములను గల్పించేనది మేధావులు. మేధావి యనఁగాఁ దనను దాను మినహాయించికొని యోచించేవాఁడు. కాబట్టి శాస్త్రముల సత్యాసత్యములను, అనుసరణ యోగ్యతను నిర్ణయింపవలసినదియు మేధావులే, సమాజము గాని, వ్యవస్థలు గాని, సంస్థలు గాని, ప్రభుత్వములు గాని కావు. మచ్చేన కొకానొక రాజు తన పెంపుడు కుక్కను స్వంత కుమారునితో సమానముగా మన్నించేచేండవచ్చును. రాజు ననుసరించి రాజపరివారము సైతము దాని నట్లే మన్నింపవచ్చును. కాని దానికి వైద్యము సేయవలసి వచ్చినప్పుడు వైద్యుఁడు దానిని శునకదృష్టి తోడనే మన్నించి మందివ్వక తప్పదు. అట్లు కాక, యాతఁడు జంతువైద్య సూత్రములను విస్మరించి, లోకుల మర్యాదనే పాటిగాఁ గొని మనుష్యోచిత వైద్యము జేసినచో దానికిఁ బ్రాణాపాయము వాటిల్లవచ్చును.

(ఆ) పైగద్యలో రాజేటికమును గూర్చి చెప్పిన యుదాహరణమే ప్రజాస్వామ్యమునకున్ను వర్తించేను. సంబంధి శాస్త్రమునందుఁ జాలినంత వ్యుత్పన్నులు కానటువంటి సాధారణులు తచ్ఛాస్త్రవిషయముల కనుకూలముగాఁ గాని, ప్రతికూలముగాఁ గాని యభిప్రాయములను వెలిబుచ్చుట కర్హులు కారు. వా రెందఱున్నను, వారి మాటలను బాటిగాఁ గొని శాస్త్రవిషయముల కన్యథా గతిఁ గల్పించుట మిక్కిలి యనుచితము. ఇది యొక మార్గదర్శక సూత్రము.

సూత్రము – 4 : **మానవ కల్పితము.**

**వృత్తి :** ప్రకృతిలోఁ బ్రకృతి మాత్రమే యున్నది. శాస్త్రములు లేవు.

(అ) శాస్త్రవచనములు మిథ్య యని దీని తాత్పర్యము కాదు. ప్రకృతి పెక్కు శాస్త్రములుగాఁ గాక యొక్కటే శరీరముగాఁ బ్రవర్తించేను.

(ఆ) శాస్త్రములెల్లయు మానవభాషామయమ్మైన యొకానొక స్వకీయ యోచన వ్యూహపరిధికి బందీలు. అవి విషయములను మానవమేధస్సున కవగతము జేయుట కుద్దేశింపఁబడిన కృత్రిమ సంకేతపదముల భూయిష్ఠములు. ప్రకృతితోఁ బోల్చినప్పుడు మానవుఁడు మేధస్సునకుఁ బరాకాష్ఠ కాఁడు గనుక వాని నమ్మిబాటు పాక్షికము.

(ఇ) తన కాసక్తిని బుట్టించేనవియుఁ దన కుపకరించేనట్టివియు నైన విషయముల గూర్చియే తప్ప మనిషి యింక దేనిని గూర్చియుఁ బట్టించికొనలేదు. తత్ఫలితముగా శాస్త్రములలో నొక్కొక్కటియు వస్తుతత్త్వము నందేకదేశముల పైననే దృష్టి సారించేనవిగాఁ బరిణమించేటఁ జేసి యొకే వస్తువునందు వాని దృష్టిపడని పార్శ్వము లింకను బెక్కుండును. కనుక సమగ్ర వస్తుతత్త్వము విషయమ్మై వాని సిద్ధాంతము లంతిమనిర్ణయములు కావు.

(ఈ) ఒక్క వర్ణనీయ వస్తువునకే కల వేఱువేఱు కోణముల ననుసరించి



మనిషి వేఱువేఱు పరిభాషలతో దాని లక్షణములను వేఱువేఱు శాస్త్రములుగా సూత్రీకరించేను గనుక నొక శాస్త్ర మింకొక శాస్త్రమునకు సహాయకమున్ను పూరకమున్ను అగును గాని ప్రత్యామ్నాయము మాత్రము కాఁజాలదు. అట్లే వేఱువేఱు శాస్త్రముల దృక్కోణములున్ను, పరిభాషలున్ను, ప్రయోగ సరణులున్ను భేదించుట చేత నొక శాస్త్ర మింకొక శాస్త్రపు సిద్ధాంతములను దన అంతరన్వయి సిద్ధాంతముల తర్కబలిమితో ఖండింపఁజాలదు.

సూత్రము – 5 : **శాస్త్రవేదాంత మన్నివేళలఁ దత్ప్రయోగముపైనఁ దీవ్రప్రభావశాలి కాకపోవచ్చును.**

**వృత్తి :** ఒక శాస్త్రము యొక్క సిద్ధాంతభాగమునందలి వస్తుతత్త్వ నిర్వచనములు తప్పయినను, అసమగ్రమ్మైనను, దత్ప్రయోగాభిలాషుల కర్థము కాకపోయినను దాని ప్రయోగభాగము విజయవంతమగుట కది యెల్లవేళల నొక పెద్ద యాటంకము కాకపోవచ్చును.

(అ) ఎందుకనఁగా – ఏ శాస్త్రమునం దైనను బ్రయోగవిధానమే ముందు జనించేను. దాని తత్త్వీకరణములు పిమ్మట బయల్వెడలును. కాని ప్రయోగ విధానమును లెస్సగా నర్థము జేసికొన్న తొలుదొల్తటి శాస్త్రకారులు వాని యన్నింటి సమన్వయరూపముగా సరియైన సిద్ధాంతభాగమును సైతము లెస్సగాఁ గూర్పఁగలరన్న హామీ లేదని గ్రహించేనది. అందుచేత నొకానొక శాస్త్రములోఁ గొన్ని యంశములు స్ఖాలిత్య దూషితములైనంతమాత్రముచేత యావచ్ఛాస్త్రమున్ను తప్పుల తడికయే యని భావించేట సరికాదు – ఆ లోపభూయిష్ఠాంశములు ఆ శాస్త్రమునకు గుండెకాయ వంటివని యెంతగాఁ భావింపఁబడుచేన్నప్పటికిన్ని.

(ఆ) ఇందుకు విపర్యాసముగా – నిర్దుష్టమయిన సిద్ధాంతభాగములు గల శాస్త్రములు సైత మన్నివేళలఁ దమ ప్రయోగప్రక్రియలో నాశించినయంతగా

సఫలము కాకపోవచ్చును. ఏలన, శాస్త్రముల యందు సిద్ధాంతభాగము లున్నంత ధ్రువముగా వాని ఫలితభాగములు లేకపోవుట అనుభవవేద్యము.

(ఇ) శాస్త్రపరిభాషలో లోపములున్నవని తెలిసినను, వాని సంస్కరణప్రక్రియ కారంభస్థాన మేదియో తేఁటతెల్లము కాని సందిగ్ధస్థితిలో వానిని మేధావు లపకీర్తి కొడంబడి యథాతథముగాఁ గొనసాఁగించుటయో, శాస్త్రమునే యేక మొత్తముగాఁ ద్రోసి పుచ్చుటయో జఱుగును.

సూత్రము – 6 : **శాస్త్రము లిఱుతెఱఁగులు.**

**వృత్తి :** ప్రాకృతేయములును, మానవీయములు నని శాస్త్రసంచయము స్థూలముగా రెండు విధములు. వీనిలోఁ బ్రాకృతేయ శాస్త్రములు ప్రకృతి యందలి శక్తులను, బదార్థతత్త్వములను వర్ణించునట్టివి. మానవీయములు మానవ నాగరికతా పరిణామక్రమమును,దానికి దోహదించిన వివిధ జీవన రంగములను మఱియు వ్యవస్థలను వర్ణించునట్టివి.

(అ) శుద్ధములును, అనువర్తితములును అను భేదము చేత మఱల శాస్త్రము లిఱుతెఱఁగులు. భౌతికశాస్త్రము, జీవశాస్త్రము, రసాయనశాస్త్రము మొదలగు నవి ప్రాకృతేయములు. ఇట్టివే శుద్ధశాస్త్రములున్ను అగును. వీని నుండి యుద్భవించిన వ్యవసాయము, వైద్యము మున్నగు కొన్నియితరశాస్త్రము లనువర్తితములు. గణిత మేకకాలములో శుద్ధమున్ను, అనువర్తితమున్ను అగును. శంసకములును, శాసకములని మఱిరెం డుపభేదములు కలవు. శుద్ధశాస్త్రములు కేవల వర్ణనాత్మకములు కనుక వానిని శంసక శాస్త్రములని పిలువఁదగును. ఇది వలయును, ఇది వలదని విధినిషేధములను జెప్పునవి శాసకములు. అనువర్తిత శాస్త్రములలో హెచ్చుపా లిటువంటివి.

(ఆ) శాస్త్రసత్యము లనుభవాస్పదములున్ను, ప్రయోగాస్పదములున్ను అని యింకను ఇఱుతెఱఁగులు. ఒక వ్యక్తి తనకుఁ దాననుభవింపఁజాలినవియు



నట్లని యితరుల కనుభవమివ్వలేనివియు ననుభవాస్పదములు. తద్విపర్య యముగాఁ దా ననుభవించి తెలిసికొనుటయే కాక యితరులకు సైత మను భవమును గలిగించి తెలుప వలనుపడునవి ప్రయోగాస్పద శాస్త్రములు. అట్లే శాస్త్రసత్యములు సద్యోగోచరములున్ను, చిరగోచరములున్ను అని మఱి యిఱుతెఱఁగులు. వెనువెంటనే సాక్షాత్కరించునవి సద్యోగోచరములు. భవిష్యమున సుదీర్ఘకాలమునకుఁ దెలియవచ్చునవి చిరగోచరములు.

(ఆ) భాష, సాహిత్యము, చరిత్ర, రాజనీతి, సమాజము, మనస్తత్త్వము, ఆర్థికవ్యవస్థ, వాణిజ్యము, చట్టము, మతము మున్నగునవి మానవీయ శాస్త్రములు. వీని నుండి యుద్భవించిన యితర శాస్త్రభేదములు సైతము కలవు. ఇవి యేకకాలములో శంసకములున్ను, శాసకములున్ను అవును.

సూత్రము – 7 : **నైకాంతికములు.**

**వృత్తి :** పెక్కు శాస్త్రములు నైసర్గికముగా బహిరన్వయులు. అనఁగా నితరే తరములైన సంబంధిశాస్త్రముల తోడుపాటుతో మాత్రమే నర్థము సేసికొనఁ దగినవి.

(అ) ఒక్కొక్క శాస్త్రరచన మొక్కొక్క దృక్కోణమునే ప్రదర్శింపఁగల్గును. అందుచేత నొక్క విషయమునకే పెక్కు పార్శ్వములున్నప్పుడు వానిని గనుగొన్న వివిధ రచయితలకు వివిధ దృక్పథములేర్పడుట విడ్డూరము కాదు. కనుక వాని ప్రాతిపదికముపై నిర్మితములైన విభిన్నశాస్త్రములు తుల్య ప్రామాణ్యము గలవి. అయినను వానికి వేఱువేఱ శాస్త్రములనియే పరిగణ నము.

సూత్రము – 8 : **ఈ మందిమన్నియ మొక రాజనీతిశాస్త్రము.**

**వృత్తి :** మంది యనఁగాఁ బ్రజలు. మన్నియమనఁగా రాజ్యము. ప్రజలకుఁ జెందిన రాజ్యము మందిమన్నియము. రాజ్యాధికార మెవ్వటో కొలఁదిమంది

పెత్తనదారులకుఁ గాక యావత్తు ప్రజలకున్ను చెందినదైనప్పటి వ్యవస్థ యొక్క స్వరూపస్వభావములను వర్ణించేనదగుటఁ జేసి యీ కృతికి మందిమన్నియ మను పేరు నిశ్చయమైనది.

(అ) ప్రజాస్వామ్యములో రాజులకుఁ బ్రాధాన్యము లేనప్పుడు రాజనీతి యని యెందు కనవలె ? ప్రజానీతి యనవచ్చుఁ గదా ? యని శంకఁ జేసితిరేని, నిచ్చట రాజశబ్దము కాలానురూపమై ప్రజలకంటె వేఱైన పరిపాలన వ్యవస్థను సూచించునదే కాని యనూచానమైన రాజేఱికమునకు సూచకము కాదు. మాటల యర్థావగతికిఁ బరివర్తనము దేశకాలానుయాత్రము. అధికార యుద్ధమునకు <u>రాజ</u>కీయమన్నప్పుడు <u>రాజ</u>నీతి శబ్దప్రయోగమునకున్ను ఆక్షేపణము లేదు. అదియునుం గాక, ప్రజాస్వామ్యములో సైతము ప్రభువు లకు సముచిత స్థానమే కలదు. ఐనను, నీతిభేదములను గుఱించి చర్చించు ప్రకరణము నందుఁ బ్రజానీతియు, రాజనీతియు నచ్చేమచ్చే గా నొక్కటి కావని తెలిసికొందుము.

(ఆ) రాజనీతిశాస్త్రమగుట చేత నిది యొక దినుసు మానవీయశాస్త్రము.

సూత్రము – 9 : **వ్యవస్థలు కాలపరతంత్రములు.**

**వృత్తి :** రాజేఱికము, ప్రజాస్వామ్యము మున్నగునవి కాలగతికి లోఁబడినట్టివి. అనఁగా నే వ్యవస్థయుఁ జిరస్థాయి కాదని భావము.

(అ) మానవుని మనుగడకుఁ దెలివితేఁటలు కాక ధైర్యమొక తప్పనిసరి యోగ్యతయైన కాలములో నాయుధధారణమున్ను, శరీరబల సంపాదన మున్ను ముఖ్యమైనవి. వ్రాఁతకోఁతల యక్కఱ మిక్కిలి తక్కువగా నుండి మనిషిని మనిషి నిర్మలముగా విశ్వసింపఁగలిగిన కాలములో వేలాదిమంది యొక్కఱినే రాజేగా నమ్మికొని కొలుచుచే నాతని యాజ్ఞలకు లోంగి వర్తిం చేట తేలికగా వీలుపడినది. అప్పు డా వ్యవస్థ పెక్కు సహస్రాబ్దుల కాలము

.



పా టద్వితీయముగాఁ గొనసాఁగి యున్నది.

(ఆ) ఆధునిక యుగములో రాజేలున్ను, వారి కుటుంబములున్ను భోగ లాలస మఱఁగిరి. సంపదల కాపీనమతిశయిల్లినది. ఆ విధముగా వారు కర్తవ్యమును విస్మరించిరి. అట్లు వారిలో జాతి పట్ల ప్రేమ మడుగంటినప్పుడు వీరత్వమున్ను, నాత్మత్యాగధోరణియుఁ దద్ద్వారమున సహజ నాయకత్వ లక్షణములున్ను నశించినవి. దైవమననుకొన్నప్పుడు దానవుఁ డగును మానవుఁడు. లోకోత్తర సంపన్నులైన రాజేలకున్ను పూటగడువని ప్రజల కున్ను మధ్య ఎడము బారలుగాఁ బెఱిగి పరస్పర శంకాతంకములు హెచ్చి నవి. వారి పాలనక్రీడ యాజన్మపీడగాఁ బరిణమించిన పిదపఁ బ్రజలు బల వంతముగా రాజేలను, రాజేఱికములను గూలఁద్రోయక తప్పినది కాదు. ఆ విధముగా భూటానులోఁ దప్ప సర్వేసర్వత్ర ప్రజాస్వామ్య మొక యాదృ చ్ఛిక చర్యగాఁ గాక బలాత్కారపూర్వకమయిన ప్రతిచర్యగా నునికిలోనికి వచ్చినది.

(ఇ) తెలివిమీఱినవారు మంచిగా నుండఁజాలరు. మంచివారు తెలివిగా నుండుటయుఁ గష్టసాధ్యము. నాగరికత ముదిరిన దశలో మానవు ల క్క మనుష్యుని దేవుఁడుగా నమ్మి యాతనికి సంప్రదాయబద్ధముగా నణఁగి మణఁగి యుండుట కిష్టపడరు. కనుకఁ బ్రజాస్వామ్య ముద్భవించినది.

(ఈ) వ్యవస్థ మానవుని విఫలము సేయదు. మానవుఁడే వ్యవస్థను విఫల ము సేయును.వ్యవస్థల స్థాయిలో జేఱుగునవి పొఱఁబాట్లు మాత్రమే, నేఱ ములు కావు. కాని తన యంకితభావ రాహిత్యము చేత విఫలమైన వ్యవస్థలు స్వతహాగానే లోపభూయిష్ఠములని యాతఁడు వానిపై నెపము వేయును. ఉత్తరవాదులైన వ్యక్తుల దోషములకు వ్యవస్థలను దండించేట లోకానుభవ సిద్ధము. చిరశ్రమవిరచితములగు వ్యవస్థల కమాయకు లప్రతర్కితముగా స్థాపకులగుదురు. వానిని మేధావులు సుదీర్ఘ ముపయోగించేకొందురు,

కడపట నదూరదర్శు లనాయాసముగాఁ గూలఁద్రోయుదురు.

సూత్రము – 10 : **దృష్టాంతములు శ్రోతృధారణా గోచరములు.**

**వృత్తి :** దృష్టాంతములనఁగా నుదాహరణములు. శ్రోతృధారణ యనఁగా వినువారి జ్ఞాపకశక్తి. ఈ గ్రంథమునందలి సూత్రముల కుదాహరణములు, వానిని వినువారి జ్ఞాపకమునకు గోచరింపవలెను.

(అ) అనఁగా నీ గ్రంథమునందు సూత్రముల కుదాహరణము లివ్వఁబడవని తాత్పర్యము. అనఁగా వారు ప్రతి సూత్రమును దమ లోకవార్తా పరిజ్ఞానము తో ననుసంధానింప యత్నింపవలెనని సూచనము.

(ఆ) వేదములకు వలె లౌకిక శాస్త్రములకు స్వయంప్రామాణ్యము లేదు కనుక కేవలమొక గ్రంథప్రణేత చెప్పినాఁడను దుర్బల ప్రాతిపదికముపై ఆతని సూత్రముల యొక్క ఋజుత్వమునం దచంచల విశ్వాసముంచేట యెట్లం టేని – ఏ శాస్త్రమైనను, సూత్రమైనను, దృష్టాంతమైనను దమ స్వంత పరి శీలనానుభవముల గీటుఱాలపై నిగ్గుతేలనిదే యెవ్వఱున్ను గ్రుడ్డిగా నంగీ కరింపఁ బనిలేదు.

(ఇ) మానవీయ శాస్త్రములు గడచిన చరిత్ర ననుసరించినట్టివి. చరిత్రను గుఱించిన భాష్యములు పెక్కు దృష్టిభేదముల కథనములు. ప్రజాస్వామ్యము లో నెంత గొప్ప వాదమైనను దానిని వాదించువారి వ్యక్తిగత స్వాభిప్రాయము గా మాత్రమే జూడఁబడును గావున నెవటికి వారు వితర్కించికొనుట మేలు.

(ఈ) ప్రజాస్వామ్య వైచిత్రు లిటీవలివే కనుక వానికి లభ్యమగు నుదాహరణ ములను బేరుపేరునఁ బేర్కొనుట మైత్రీభావమునకు దారితీయదు.

సూత్రము – 11 : **బహుళ మభివ్యక్తి.**

**వృత్తి :** అభివ్యక్తి యనఁగా మనస్సులోని మాటను బయటకు వెల్లడించేట.



అది యిందులో రకరకాలుగా జేఱుగవచ్చును. మాటలే సర్వస్వము కావు.

(అ) కొన్ని తెలియని విషయములున్ను, తెలిసినను జెప్పలేని విషయములు ఉండవచ్చును. ఎంత నొక్కి చెప్పినను జెప్పలేకపోయిన విషయములున్ను కొన్ని యుండవచ్చును. చెప్పఁదలఁచియు మఱచిన విషయములు మఱికొన్ని యుండవచ్చును. ప్రకరణప్రతియోగిగాఁ జెప్పినవి యింకొన్ని యుండ వచ్చును. ఏది యెట్లున్నను దీనిని సక్రమముగా నర్థము జేసికొని ఊాలను బరిహరించి అవ్వలనే పరిగ్రహింపఁదగును. ఏదియు ననవద్యముకాదు గాన మెఱుగైన భావిశాస్త్రముల నిర్మాణమున కవకాశము కొదువ కాదు.

సూత్రము – 12 : **బహిర్గతములు బహుజనీనములు.**

**వృత్తి :** ఒక్కసారి వెలుఁగులోనికి వచ్చిన యానక జ్ఞానము దాని ద్రష్టతో సహా యే యొక్కటికిన్ని చెందక పెక్కంద్రకుఁ జెందినదగును. అనఁగా దాని నెవ్వరైనను, ఎట్లయినను వాడుకొనవచ్చునని తాత్పర్యము.

(అ) తెలిసిన విషయమును బయటకుఁ జెప్పకముందు మాత్రమే యది ద్రష్టది. ఒక్కసారి బయటకు వెల్లడించిన యానక అది సమాజమునకుఁ జెందినదగును. ఏలన, జ్ఞానప్రయోగ మెల్ల వస్తువుల కంటెను శీఘ్రతరముగా వ్యాపించేటయే కాక అంతయే శీఘ్రముగాఁ బ్రాఁతవడును గూడ.

(ఆ) కనుక జ్ఞానద్రష్టలకు జ్ఞానముపైనఁ గాక దాని వినియోక్తల నెనరులపై ననే యధికారము కలదు.

సూత్రము – 13 : **శైలి నైకపూర్వ్యప్రతిబింబిని.**

**వృత్తి :** ఈ గ్రంథములో నుపయోగించిన శైలి పెక్కుఱు పూర్వుల ప్రభావము ను బ్రతిబింబింపవచ్చును.

(అ) ఆ ప్రభావములలోఁ గొన్నింటి స్పృహ గ్రంథకర్త కుండవచ్చును. మఱి

కొన్నింటికి లేకపోవచ్చును. పదములను బట్టి, పదబంధములను బట్టి, శైలిని బట్టి విలువగట్టక ప్రకృతార్థమునే పరిశీలింపవలెను.

సూత్రము – 14 : **ప్రవాహిని శాస్త్రరీతి కనుపయోగిని.**

**వృత్తి :** ప్రవాహిని యనఁగా సమకాలీన లోకవ్యవహారమునందున్న భాషారీతి. దానికున్న విశేష పరిమితుల దృష్ట్యా మఱియుఁ గాలుష్యము దృష్ట్యా అది యీ శాస్త్రశైలి కుపయోగపడదని భావించి విడిచిపుచ్చేడమైనది.

సూత్రము – 15 : **శైలీ వైవిధ్య సాదృశ్యములు విషయవైవిధ్యము గాని విషయవైరుధ్ధ్యము గాని కావు.**

**వృత్తి :** రెండు సూత్రములను వివరించేట కుపయోగించిన పదముల లోను, బదబంధములలోను, వాక్యనిర్మాణములలోను బోలిక లున్నంతమాత్ర మున నా రెండు సూత్రములున్ను ఒక్కటి కావు. అట్లులే తద్విపర్యయముచేత నవి పరస్పర వ్యాఘాతములున్ను కావని గ్రాహ్యము.

(ఆ) సూత్రవృత్తి సూత్రనిర్విశేషము.

(ఇ) శాస్త్రములను సావధానముగా నధ్యయింపవలసినదని సూచనము.

**సూత్రము - 16 : సిద్ధాంత పూర్వపక్షములు లేవు.**

**వృత్తి :** ఖండన మండనములయం దిది తటస్థము. గ్రంథప్రణేతకు బుద్ధి గోచరములైన ప్రస్తావనములను యథాతథముగా లిపిబద్ధము సేయుట కిది యొక శుచియైన యపాక్షిక ప్రయత్నము.

సూత్రము – 17 : **మూఁడవ కన్ను కావలెను.**

**వృత్తి :** తాత్పర్యము సుబోధము. ఇందులకు వలసినది–మనుష్యుఁడు లోక సముద్రపు హోరు వలన నోసరిల్లి శ్రద్ధధానుఁడై తన యంతర్వాణిని జెవి యొగ్గి యాలకించుట.



(అ) అద్భుతరస మెల్లజ్ఞానమునకున్ను మూలమైన సహజాతము. నమ్మకము నరుని తొలి స్పందనము. బిమ్మిటి పిమ్మటిది మాత్రమే. కనుక తటస్థతా వికాసమునకు ముందు సానుకూల్యము ప్రధానము. నిర్హేతుకమైన ప్రాతికూల్యము జ్ఞానమున కాదిలోనే హంసపాదు వంటిది.

(ఆ) చెల్లచెదరైన లోకసత్యములలోను, బాదార్థిక వాస్తవములలోను అంతస్సూత్రముగా, నలిఖితముగా నున్న నిబిడ, నిగూఢ సందేశములను గ్రహింపని విస్తృత శాస్త్రాధ్యయనము సఫలశ్రమము కాదు. చేదువులను గాక వాని మర్మమునే యెఱుఁగవలెను. మానవోపజ్ఞమగు శబ్దపరిధి నధిగమింప లేనప్పుడు ప్రతిమాటయు నర్థాంతరావబోధమున కాస్పదమగును.

(ఇ) ప్రశ్నించుట చేఱుకైన పని. కాని యెల్లప్పు డితరులనే ప్రశ్నించుచుఁ బ్రతిచిన్నవిషయమును గొసటి చెప్పించుకొనువారికిది యనుద్దిష్టము. ఎవరి ప్రశ్నములకు వారే సమాధానముల నన్వేషింపవలెను. వాదాపదేశమున దాని నితరులపై మోపుట సమీచీనము కాదు. లోకకల్యాణకాములు మూలచ్ఛేదక ప్రశ్నములను గాక మౌలికప్రశ్నములనే లేవనెత్తుట పాడి. ఎందుకంటేని, వాక్చతురత బుద్ధి చతురతకు నిదర్శనము కాదు. ఇది యొక మార్గదర్శక సూత్రము.

---

: ప్రకరణాంత గద్య :

**ఇది సకలసూరిసమ్మతిపాత్ర,హరితసగోత్రపవిత్ర, శ్రీతాడేపల్లి భానుమతీ వెంకటేశ్వర పుణ్యమిథున తృతీయపుత్ర, శ్రీషిరిడీసాయి లలితా మహామాతృ నిర్ణిబంధ కృపాకటాక్ష వీక్షణైక సంపద్యమాన బహుభారతీ గాత్ర, లలితాబాలసుబ్రహ్మణ్యము రచించిన మందిమన్నియమను నభినవ రాజనీతితంత్రమునం దవబోధాఖ్యమగు రెండవ ప్రకరణము.**

# మందిమన్నియమ్

3. కౌటుంబిక ప్రకరణము

## మొదటి ప్రస్తావనము – సమాజ తత్త్వము

సూత్రము – 1 : **సమాజము.**

**వృత్తి :** ఇది యధికారసూత్రము. ఇకముందు చెప్పఁబోవు పదునొకండు (11) సూత్రములకు దీని ననువర్తించికొనునది.

సూత్రము – 2 : **కుటుంబముల సమాహారము.**

**వృత్తి :** సమాజమొక యమూర్తమైన  సాముదాయిక స్వరూపము. అది వ్యష్టి కుటుంబముల కంటె వేఱుగా నునికిలో లేదు. కాని సమష్టి విషయము లను గుఱించిన చర్చకు సమాజశబ్దము మిక్కిలి యుపకరించును.

(అ) కుటుంబమనఁగా – గతమునందుఁ గాని, వర్తమానమునందుఁ గాని స్వచ్ఛంద శాశ్వత మైథున బంధము గల స్త్రీపురుషుల జంటలున్ను వారి సంతానమున్ను. వారెక్కడ నివసించేచేన్నను ఒక్క కుటుంబముగానే జేమ.

(ఆ) పక్షాంతరమున – వారిలో నొకే యింటిలో నివసించేచేన్న యే యిద్దఱినైనను గుటుంబమనఁదగును.

(ఇ) తన కుటుంబము ప్రత్యక్ష సమాజము.

(ఈ) చేట్టుప్రక్కల నివసించే నిఱుగుపొఱుగువారు సన్నిహిత సమాజము.

(ఉ) తన యూరివారు సమీప సమాజము.

(ఊ) మిగత దేశమునందలి జనులు దూరసమాజము.



(ఋ) ప్రత్యక్షేతరములను బరోక్ష సమాజములనియు, నదృశ్య సమాజ ములనియుఁ జెప్పవచ్చును. ఏలన, నవియుఁ , గుటుంబములున్ను పరస్పర ప్రభావమునకు లోనగుట నిత్యము కాదు.

( ౠ ) మనిషి ప్రాథమికముగాను మఱియుఁ బ్రత్యక్షముగాను గుటుంబ జీవి. తన కుటుంబము ద్వారా అంతిమముగాను, బరోక్షముగాను సంఘజీవి.

సూత్రము – 3 : **సూక్ష్మముగా స్వచ్ఛంద మిథునము.**

**వృత్తి :** మిథునమనఁగా స్త్రీపురుషుల జేంట. సమాజము తన సూక్ష్మరూప ములో నిష్టపూర్వకముగా జేతకట్టిన  స్త్రీపురుషుల జేంట మాత్రమే.

(అ) స్వచ్ఛందమనఁగా – మనిషి బాహ్యపరిస్థితుల ప్రాబల్యము చేతఁ గాని, యితరుల బలవంతముచేతఁ గాని ప్రభావింపఁబడక తన సహజ ప్రకృతి చేతఁ బ్రేరణపొంది చేయు పని.  సహజప్రకృతియే యిష్టానిష్టములను నిర్ణ యించేను. ఇష్టానిష్టములే ప్రతిభాపాటవములను శక్తియుక్తులను బెం పొందించేను.

(ఆ) మానవప్రకృతియందలి యీ స్వచ్ఛందతయు స్వశక్తియు గలిపి *నిసర్గసత్తా* యని వ్యవహరింపఁబడును.  ఇది మానవ నాగరికతలోఁ బ్రభుత్వములేర్పడకముందు మొదట నాహారాన్వేషణముగాను ఆ ప్రక్రియలోఁ జేసిన పోరాటముగాను, తన జేంటను వెదకికొను ప్రయత్నముగాను వ్యక్తమై యున్నది. తమ బ్రతుకులపైఁ దమకుఁ గల సహజ స్వామ్యమున్ను, బాధ్యతయు మఱియు వానికి హాని వాటిల్లినప్పుడు ప్రతిచర్యలు గైకొనుటకుఁ గల సమస్తమైన మానవీయ హక్కుభుక్తములున్ను – అంతయే కాక, వ్యవస్థలను శాసనములను ఆమోదించేటకున్ను తిరస్కరించేటకున్ను ఉన్న

దైవదత్తాధికారములు వెలిసి కుటుంబముల నిసర్గసత్తా. ఇది యెల్ల రాజ్యాంగ చేట్టములకున్ను, మతధర్మశాస్త్రములకున్ను అతీతమైనట్టిది. కాని నాగరిక విజ్ఞానమయ సమాజములలో వానిద్వారా అదుపు సేయఁబడుచేండును. మంచికైనను, జెడ్డకైనను గుటుంబముల నిసర్గసత్తా ప్రకృతిప్రసాదము. అనేక కుటుంబముల యామోదముతో వాని నిసర్గసత్తాలు సమ్మేళించి సమాజాధికారముగాను, రాజకీయాధికారముగాను వ్యక్తమగును. వ్యవస్థాగత సహాయము లభింపనప్పుడు వ్యక్తి తన కుటుంబప్రతినిధిగా నిసర్గసత్తాను బ్రయోగించే సంభావ్యత కలదు. అప్పుడు తన హృదయకోశ తర్కమే తన రాజ్యాంగము.

(ఇ) ఏ కాలమునకుఁ జెందినను, స్త్రీపుమ్మిథునము ప్రథమ సమాజము.

సూత్రము – 4 : **స్థూలముగా దేశకాలాబాధ్యము.**

**వృత్తి :** మానవ సమాజము తన యొక్క విరాడ్రూపములో నొక ప్రత్యేక ప్రాంతమునకుఁ గాని, యొక ప్రత్యేక కాలఖండమునకుఁ గాని పరిమితము కానటువంటి విశ్వజనీనమూర్తి. అది భూమండలమునందుఁ జెల్లచెదఱుగానైనను ఎల్లప్పుడును, ఎల్లెడల నునికిలో నుండును. దాని తత్త్వము దేశకాలముల ప్రభావముచేత బాధింపఁబడదు.

(అ) అనఁగా – దేశ, కాల, పరిస్థితులను బట్టియు, ననుష్ఠానమునందున్న పరిపాలనవ్యవస్థలను బట్టియు వ్యష్టికుటుంబముల బుద్ధి గాని, వ్యక్తుల బుద్ధి గాని మారవచ్చును. కాని వాని సాముదాయిక రూపమగు సమాజపుఁ దత్త్వము మాత్రము పరిణామాతీతమని గ్రాహ్యము.

(ఆ) అనఁగా – వివిధ మానవ సమాజములు సాంస్కృతికముగాను, రాజకీయముగాను నొండొరుల నుండి యెంతగా భేదించినప్పటికిన్ని అవి వివిధ సందర్భములలోఁ దమ సభ్యులను మన్నించే పైనము మట్టుకు ప్రపంచమునం



దెల్లెడలఁ బ్రాయికముగా నొక్కటియే.

సూత్రము – 5 : **ప్రాకృతికము.**

**వృత్తి :** సమాజమనెడి గుంపు, మానవుల యొక్క సచేతన సంకల్పము వలనఁ గాక, మానవజాతి యందుఁ బ్రకృతియే స్వయముగా జన్యుద్వారమునఁ బ్రవేశపెట్టిన నిగూఢ మనఃప్రేరణ మూలమున నేర్పడినటువంటిది. ఇది తొలుతఁ బ్రత్యక్ష సమాజ రూపమున మొదలైనది.

(అ) మానవసమాజపుఁ బుట్టుకలో సహజముగా మానవజోక్యము లేక పోవుట వలన, మానవకృతమైన రాజ్యవ్యవస్థ యున్నను లేకపోయినను మానవసమాజము మాత్రముండి తీఱునని భావము.

(ఆ) పరోక్ష సమాజమునందలి ప్రతివ్యక్తితోడను వైయక్తిక సాన్నిహిత్యము లేకపోవుట వలన మానవులకుఁ బరోక్షసమాజము పట్లఁ బ్రేమాభిమానములున్ను అంకితభావమున్ను సహజముగాఁ దక్కువ.

సూత్రము – 6 : **ఎల్ల యితర వ్యవస్థల కాకరము.**

**వృత్తి :** ప్రకృతిప్రసాదమైన ప్రత్యక్ష సమాజ వ్యవస్థనుండి యనంతరము క్రమముగా మానవకృతమైన పరోక్ష సమాజములున్ను, తత్సంబంధితములైన యుపవ్యవస్థలున్ను ప్రభవించినవి. వ్యవస్థ యనఁగా పెక్కండ్ర యాచరణమునందున్న నియమావళి.

(అ) ఉపవ్యవస్థలనఁగాఁ – ప్రభుత్వములు, సైన్యములు, మతములు, సంఘములు, సమితులు, సంస్థలు, వ్యాపారములు మొదలైనవి.

(ఆ) మొదటఁ గొన్ని పదులలో మట్టుకే యున్న ప్రత్యక్షసమాజపు జనసంఖ్య తరములు గడచిన కొలఁది పందలై, వేలై, లక్షలైన పిదప వారు పెక్కు క్రొత్త యూరువల్లెలను నిర్మించి వానియందుఁ గాపరములు పెట్టినప్పుడు పరోక్ష

సమాజముగాఁ బరిణమించెదరు. అప్పుడితర వ్యవస్థలను బూర్ణ స్థాయిలో నెలకొల్పుట కావశ్యకమ్మైనంతమంది జనమున్ను, అన్ని తెఱఁగుల మనస్తత్త్వములున్ను, తత్కృతమ్మైన వస్తుసంపదయుఁ బ్రోఁగువడును.

సూత్రము – 7 : **అపేక్షాధారితము.**

**వృత్తి :** అపేక్ష యనఁగా నవసరము. ప్రత్యక్షమ్మైనను, బరోక్ష మ్మైనను సమాజ మొకటితో నొకటికిఁ గల యవసరములను బురస్కరించికొనియే యేర్పడును. అది నడచుట సహితము ప్రాయికముగా నట్లే.

(అ) మానవులు సహజముగా సహేతుక జీవులు కనుక నిది యొక వైచిత్రి కాదు.

(ఆ) కనుక పరోక్ష సమాజమున్ను, కుటుంబములున్ను చేసికొను సేవలు ఉచితములు గాని, దయాదాక్షిణ్యపూర్వకములు గాని, పరోపకారార్థములు గాని కావు. వైయక్తిక స్థాయిలోని సేవలు మట్టుకు కొంతవఱకట్టివై యుండవచ్చును.

(ఇ) తమ ప్రాథమికావశ్యకతలు తీఱిన తరువాత నెవ్వరైనను గొందఱికిఁ బరోపకారము సేయవచ్చును.కాని మొత్తము పరోక్షసమాజమున కెవ్వఱున్ను ఎల్లకాలముచితముగా సేవఁ జేయఁజాలరు. ప్రాథమికావశ్యకత లన్నవి దేశకాలములను బట్టియు, గుంపులను బట్టియు భేదించుచుండునని గ్రహింపఁదగును.

(ఈ) సమాజమునకుఁ దన యవసరము గడచుటయే ప్రధానము గనుక దాని కెవ్వఱున్ను అత్యాజ్యులు గారు.

సూత్రము – 8 : **పరోక్షముగా సంపూర్ణ వినయాపేక్షము.**

**వృత్తి :** సమాజ మంతర్గతముగా బహునిరంకుశమ్మైనది. అది తన సభ్యుల



నుండి నూటికి నూఱుపాళ్ళ లోఁగుబాటును, మఱియు ననురోధమును ఆశించును. కాని ఆ యాశంస బాహాటముగా వ్యక్తీకరింపఁబడదు.

(అ) మనిషి కొన్నిపట్టులఁ బ్రకృతికిని, మఱికొన్నిపట్టుల మతమునకున్ను, ఇంకొన్ని పట్టులఁ బ్రభుత్వమునకును విరుద్ధముగా వెళ్ళఁగలఁడు. కాని సమాజమును మాత్రమెంత చిన్న విషయములో నయినను ఎదిరింపఁజాలఁడు. అ ట్లెదిరింపఁ బూనికొన్నవారిపై సమాజము తీసికొనఁగల భవిష్యత్ ప్రతీకారాత్మక దండనాచర్యలు మిక్కిలి సూక్ష్మముగాను, అనూహ్యముగాను, వాని యొక్క యంతిమస్వరూపములో బహుక్రూరపర్యవసానాత్మకముగాను ఉండును. ఇందులో నాగరిక–అనాగరిక సమాజములనెడి భేదము హుళక్కి యని గ్రహించునది.

(ఆ) మనిషి తన సమాజమును ఉద్దేశపూర్వకముగా నెదిరింపకపోయినను, అతని యొక్క, లేదా ఆమెయొక్క ప్రవర్తనా వైలక్షణ్యమే వారిని దాత్కాలికముగాఁ గాని శాశ్వతముగాఁ గాని సమాజము తన శత్రువులుగా భావించుటకు సరిపోవును. అనఁగా – ఒక మాటను జిత్రముగాఁ బలుకుట గాని, ఒక యుడుపును జిత్రముగా ధరించుట గాని, ఒక చిత్రమ్మైన యలవాటును గలిగి యుండుట గాని సంఘవ్యతిరేకముగాఁ బరిగణింపఁబడును. సాధారణముగా సమాజము తన సభ్యులలో వైవిధ్యమును సైపఁజాలదు.

(ఇ) కనుక ఫలితార్థముగా – సమాజములో మిగిలినవారు సేయని పనులను వ్యక్తి కూడఁ జేయకుండుటయు, వారు సేయు పనులనే వ్యక్తి కూడఁ జేయుటయు – ఇవి మాత్రమే సక్రమమ్మైన, సవితర్కమ్మైన, పరిపక్వత గలిగిన నైతికప్రవర్తనముగా భావింపఁబడును.

(ఈ) పర్యవసానముగా – మానవులు తమ యేకాంతమునందును సమాజసాన్నిధ్యమునే యనుభవించుచుందురు.

(ఉ) సమాజము యొక్క యీ యాదిమ నిరంకుశ లక్షణమును దానివలనఁ బ్రభవించిన యుపవ్యవస్థలు సైతము వారసత్వముగా స్వీకరించేను. అనఁగా వైవిధ్యము నవియు సహింపవని భావము.

(ఊ) కాఁబట్టి యొకానొక సమాజపు టధికారపరిధి యెంత విస్తారమై యుం డునో దాని వైవిధ్యమంతగాఁ గుంచించుకొనిపోయి యుండును. అట్లు కానప్పుడిది వివిధ సంస్కృతుల యావిర్భావ వికాసములకు దోహదకారి.

సూత్రము – 9 : **మందప్రజ్ఞము.**

**వృత్తి :** మానవుని తెలివితేఁటలు సమాజమునందే పూర్తిగా వికసించుట కవకాశమున్నప్పటికిన్ని, ఒకానొక పరోక్షసమాజము నాగరికతలో నెంత ముందునకుఁ బోయి యున్నప్పటికిన్ని, కుటుంబముల కందుబాటులో లేని పెక్కు సౌకర్యములు దాని కందుబాటులో నున్నప్పటికిన్ని దానియందలి వ్యష్టి సభ్యు లక్కొక్కఱి తెలివితేఁటల కంటెను బరోక్ష సమాజపుఁ దెలివితేఁటలు కొదువగా నుండును. తెలివి యనఁగాఁ – బరిస్థితులను దెలిసికొని వాని ననుసరించి యోచింపఁగల్గుట మఱియు సప్రయోజనముగా ననుకరింపఁ గల్గుట.

(అ) ఫలితముగాఁ గుటుంబములు వర్తమానములోను, పరోక్షసమాజము మాత్రము గత కాలములోను జీవించుచుందురు. ఇది **వ్యష్టిసమష్టుల విజ్ఞోడు.** పరోక్షసమాజము మాటిమాటికి నాఁగిపోవు గడియారము వంటిది. దానికిఁ దెలివైన వ్యక్తులు పదేపదే మరఁద్రిప్పి యెప్పటికప్పుడు పనిసేయిం చుట విధాయకము. కనుక సంఘ సంస్కరణోద్యమము లన్నియుఁ బరోక్ష సమాజమును గతమునుండి వెలికి లాగుట కుద్దేశించినవిగా నుండును.

(ఆ) ఇక్కారణము చేత – నెంత గొప్ప సంస్కరణభావమును బ్రవేశపెట్టినను



సమాజము కాలక్రమాగతమైన మార్పుల కొడంబడును గాని యాకస్మికము లగు మార్పుల కెట్టి పరిస్థితులలోను ఒల్లదని గమనించేనది.

(ఆ) పరోక్ష సమాజమునకేది లోఁతుగా, విస్తారముగా బోధించినను అది కాలక్రమమున నొక యతివాదముగాను, ఉన్మాదముగాను, వ్యసనముగాను, జడత్వముగాను బరిణమించేను. పిమ్మట నది తర్కములందుఁ దుఱుపు ముక్కగాను ఇతరులపై బుఱదఁ జల్లుట కొఱ కాయుధముగాను ఉపయో గింపఁబడును. ఈ జడత్వము కొన్నియెడల మత, సంప్రదాయ, సంస్కృతి, సిద్ధాంత ఇత్యాది పెక్కు మాన్యనామధేయములను ధరించి ప్రచురమౌను. ఈ తీవ్రతల నెప్పటి కప్పుడు సరిక్రొత్త యాదర్శములతో సమతూకముఁ జేయవలసి యుండుటచేత నెల్లకాలములకున్ను ఒక్క విధమైన యాదర్శ ములే సరిపడవు. ఇచ్చట నున్మాదమనఁగాఁ దనకుఁ దానర్థము కామి.

(ఇ) మనిషి వ్యష్టిగా నున్నప్పు డొకవిధముగాను, గుంపులో నున్నప్పు డింకొక విధముగాను బ్రవర్తించేను. ఇందులో నెట్టి కపటమున్ను లేదు.

(ఈ) ఉపవ్యవస్థలు పరోక్ష సమాజ మాతృకములే గనుక అవి కూడ దాని వలెనె కుటుంబముల కంటె నెల్లప్పుడును వెనుకఁబడియే యుండును.

(ఉ) కనుక ననర్థములకు దీటుగా వెంటనే స్పందింపఁగల చొఱవ పరోక్ష సమాజమునకుఁ గాని దాని యుపవ్యవస్థలకుఁ గాని త్వరగాఁ బట్టుపడదు. అట్లే వ్యక్తుల గొప్పతనమును సైతమది శీఘ్రముగా గుఱుతింపఁజాలదు.

(ఊ) పైనఁ బేరుకొన్న కారణముల చేత, స్వభావరీత్యా మందకొడిదైన పరోక్ష సమాజము తన్నుఁ దానే నిర్వహించుకొనఁజాలదు కనుక, దానికిఁ బ్రభుత్వ రూపములోఁ జేఱుకైన వ్యక్తుల నాయకత్వమున్ను, మార్గదర్శకత్వమున్ను, శాసకత్వమున్ను మిక్కిలి యావశ్యకము. కనుకఁ బ్రజాస్వామ్యమనఁగా వ్యక్తులతోఁ బనిలేని, మఱియు వ్యక్తులపై ప్రజాగుంపుల యాధిక్యమును

ధ్రువీకరించునట్టి వ్యవస్థ యని భావించుట సరికాదు.

(ఋ) తద్విరుద్ధముగాఁ బ్రజాస్వామ్యమునందు సహితము పలుసందర్భములలో వ్యక్తిపరమైన యాధిపత్యమున కెక్కుడు ప్రాధాన్యమే కలదు. అధికారమును జేపట్టిన వ్యక్తులు సరియైనవారు కానప్పు డెంత గొప్ప చరిత్రగల ప్రజాస్వామ్యమున కైనను జేతికిలఁబడుటయే గతి.

సూత్రము – 10 : **గురుదేవస్థానీయము.**

**వృత్తి :** లోకసామాన్యము తమ యావత్తు పరిసర జ్ఞానమును మఱియు నైపుణ్యములను దాను పుట్టిపెఱిగిన సమాజము నుండియే గ్రహించును. కనుకఁ దమ సమాజమే తమకు గురుస్థానము. వారు సమాజమునందలి సమకాలీనాచారవ్యవహారములను దైవాదేశములతో సమానముగా భావించి పాటించెదరు గనుక సమాజము వారికి దేవస్థానీయము కూడ.

(అ) ప్రతికాలములోను, బ్రతి సమాజమునందును, బ్రతిచోటను నైపుణ్యముల నలవర్చు నిమిత్తము పల్లెకూటములుండవు గనుక మనిషి తన ప్రత్యక్ష సమాజమును గాని, పరోక్ష సమాజమును గాని చూచి, శుశ్రూషఁ జేసి వివిధ నైపుణ్యములను గఱవవలసియుండును.

(ఆ) దైవాదేశములుగాఁ జెలామణి యగు కొలఁది విషయములు వాస్తవములో నొకనాఁటి సమాజాదేశములు కావచ్చును.

సూత్రము – 11 : **వ్యక్తి కప్రత్యామ్నాయము.**

**వృత్తి :** సమాజము వ్యక్తికిఁ బ్రత్యామ్నాయము కాదు. అనఁగా వ్యక్తి తన స్థాయిలో నెఱవేర్పఁగల పనులను సమాజము తన స్థాయిలో నదియే నాణ్యతనముతో నెఱవేఱుపఁజాలదు.

(అ) వ్యక్తి సమాజమున కంటెను గొప్ప యని దీని తాత్పర్యము కాదు.



(ఆ) పిల్లలను గనుట మఱియు వారినిఁ బెంచుట మాత్రమే కాక యభిరుచులను, నైపుణ్యముల నభివృద్ధి చేయుటయు, మానవులను బ్రేమానురాగముల తోడను, దయతోడను మన్నించుటయు వ్యక్తికే తప్ప సమాజమునకు వీలుకాదు. సమాజభూమిక యిట్టి నడత కనుకూలమైన పరిస్థితులను గల్పించుట వఱకుఁ బరిమితమగును.

(ఇ) భాష, మతము, శాస్త్రము, పరిపాలనము మొదలగు సమష్టి సామాజిక విషయములతో వ్యక్తి లేదా వ్యష్టి కుటుంబపు టనుభవములున్ను, ప్రయోజనములున్ను అన్నివేళలందును యథాతథముగా సంపదింపకపోవచ్చును. అ ట్లైనంత మాత్రమునఁ గౌటుంబికాంశములున్ను, వైయక్తికాంశములున్ను మిథ్య గాని, నింద్యములు గాని కాకపోవచ్చును.

సూత్రము – 12 : **భయాకరముల యెడ భక్తిబంధురము.**

**వృత్తి :** భయమును బుట్టించువాని పట్ల సమాజమునకు నైసర్గికముగా భక్తిభావము మెండు.

(అ) వస్తు, వ్యక్తి, వ్యవస్థలయందు నిక్షిప్తమైన అప్రతీకారమగు యథేచ్ఛాచలనశీలత్వము భయాకరత్వము. అనఁగా భయమున కుత్పత్తిస్థానమైయుండుట. నిరంకుశాధికార మట్టిదే. కాని దానిని రహస్యముగాను, బరిమితముగాను వినియోగించినప్పుడే యీ సూత్ర మనుసంధేయము.

(ఆ) భక్తి యనఁగా – నూనె సోన వలె నెడతెగని స్మృతిసంతానరూపమైన మనః స్థితి. తనకు విషయభూతమైన వస్తువునం దాత్మానుసంధానము దీని ముఖ్యలక్షణము. అనఁగాఁ – దానును అదే యనియు లేదా దానిలోఁ దానొక భాగముగాఁ బరిణమింపవలె ననియు నాకాంక్షించు మనఃస్థితి భక్తి.

(ఇ) జనులు నిరంకుశాధికారవంతుల యెడల వైయక్తిక మత్సరమును

బూని ద్వేషించెదరు. కాని సామూహికముగా మాత్ర మందఱికిని లోలోపల నిరంకుశాధికారము పట్ల నారాధనభావముండునని సూత్రహృదయము.

(ఈ) దీనిని 31 వ సూత్రవృత్తితోఁ గలిపి పఠించునది. వ్యక్తులు తమ సమష్టి స్థితియైన సమాజావతారమున రక్షణాపేక్షులగు ప్రథమప్రకృతిసన్నిభులు. అట్లగుటఁ జేసి ఈషత్క్రూరమున్ను, కించిన్నిరంకుశమున్ను కానట్టి పాలక వర్గమునెడ వారికి నిరసనభావము మెండు.

---

## :: రెండవ ప్రస్తావనము – వలపు కాఁకడ ::

---

*<u>అవతారిక</u> : కుటుంబవ్యవస్థా వర్ణనమున కుపక్రమణప్రాయముగాఁ దొలుత దానికి మూలస్తంభమైన ప్రేమమును గూర్చి యీ ప్రస్తావనము నందు సూత్రీకరింపఁబడుచున్నది.*

సూత్రము – 13 : **ప్రేమము.**

**వృత్తి :** ఇది యధికారసూత్రము. పదునేఁడు (17) వెనువెంటి సూత్రము లకు దీని నన్వయించుకొనునది.ఈ ప్రస్తావనములోని సూత్రము లాది మిథునములకు వర్తింపవు. ఆదిమిథునములనఁగాఁ బ్రళయానంతర మేర్పడ్డ మానవసమాజములకు మూలభూతములైన తొలిజంటలు.

సూత్రము – 14 : **ముందు తన్నుఁ దా నభిమానించుట.**

**వృత్తి :** తాత్పర్యము సుబోధము.

(అ) తమ్ముఁ దా మభిమానింపలేనివారు పరులను సహిత మభిమానింపఁ జాలరు. ఎవతైనను దమ్మభిమానించుచున్నట్లు చెప్పినను నమ్మఁజాలరు. అట్టివారలు తమకో యితరులకో ఘాతుకులు కాఁగలరు. సూత్రమునందు ముందు అనుటఁ జేసి, ప్రేమప్రతిపత్తి కాత్మాభిమానము మునువలయిక



## మానవ ఆత్మీయతా పరివేష చక్రము




మాత్రమే యనియుఁ జివఱి వఱకుఁ దన్నుఁ దానే యభిమానించుకొనుట ప్రేమము కాదనియు భావార్థము.

(ఆ) తమను గూర్చి తామేమని భావించుచున్నారో దాని కనుగుణముగాఁ దమను మన్నించువారి యెడల గౌరవమున్ను ప్రేమమున్ను కలుగును. అందులకు వ్యత్యస్తముగా మన్నించువారిపై విరక్తియు, ద్వేషమును గలుగును. తాము హీనులమని తలపోయువారిని హీనముగా మన్నించినను వారు క్రోధింపరు.

(ఇ) ఈ విధముగాఁ బ్రేమ మాత్మాభిమానము యొక్క విస్తృతరూపము

కాఁబట్టి పరిణత మనస్కులలో నిది స్వలింగాభిమానముగాను, ఏకపత్నీ వ్రతముగాను, బాతివ్రత్యముగాను, వంశగౌరవముగాను, జ్ఞాతికులబహు మానముగాను, ఆభిజాత్యముగాను, మతాభిమానముగాను, భాషాభిమాన ముగాను, దేశాభిమానముగాను – ఇట్లు రకరకములుగా నభివ్యక్తమగును. స్పష్టతకై **మానవాత్మీయతా పరివేషచ**క్రమును బరిశీలించేనది.

(ఈ) ఇది కామమున కంతర్ముఖ కోణము.

సూత్రము – 15 : **పలు తెఱఁగులది.**

**వృత్తి :** ప్రేమమునందుఁ బెక్కు విధములు గలవు.

(అ) ఆత్మ, శరీరము, హృదయము, మనస్సు, బుద్ధి, అహంకారము అను మూలతత్త్వములతో నిర్మితమైన మనిషి ఆయా తత్త్వముల యాకాంక్షా పరిపూర్తి నర్థించి వివిధములైన ప్రేమభావములను బెంపొందించేకొనును.

(ఆ) అనఁగా – నాత్మతృప్తికై భగవత్ప్రేమమును మఱియుఁ దదాధారితమైన మతాభిమానమును ; శరీరతృప్తికై దాని యవసరములను దీర్చు పదార్థము లను, వస్తువులను మఱియు మనుషులను ; హృదయతృప్తికై కొన్ని యాదర్శ నీతులను మఱియు వాని కాశ్రయమైన మనుషులను, బ్రదేశములను ; మనస్తృప్తికై పరువుప్రతిష్ఠలను ; బుద్ధితృప్తికై కళాశాస్త్రాదివిద్యావిశారద త్వమును ; అహంకారతృప్తికై ఐశ్వర్యపదవీయశ స్సమ్మానాధికారాది సాంఘిక శ్రేణిని మనిషి ప్రేమించేచుండును.

<u>అవతారిక</u> *: వీనిలోఁ బ్రథమసమాజమున కుపాధి యగు శృంగార ప్రేమ మును గుఱించి తొలుతఁ జెప్పఁబడుచున్నది.*

సూత్రము – 16 : **నిర్దిష్ట ప్రయోజన సాధన నిమిత్తములైన నిరంతర సన్నిధాన సాహచర్యముల నుండి పొడమునట్టి సాహచర్యాభిలాషా**



**త్మకమగు మనోభావము.**

**వృత్తి :** పరస్పర మేదియో యొక యవసరము లేనిదే యిద్దఱి మధ్య ప్రేమ మంకురింపదు. వారు తఱచుగా నొండొరులను జూచికొనుట, కలిసికొనుట, మాటలాడుట, యిచ్చిపుచ్చుకొనుట మొదలయిన స్నేహపూర్వక చర్యలు సలుపుటకై వారి మధ్య అవకాశమున్నంతవఱకు వారి మధ్య ప్రేమ నిలచేను.

(అ) ఇది స్త్రీపురుష మిథునములకు సామాన్యమగు శృంగారపరమైన ప్రేమ మును గూర్చి చెప్పినది. ఇతర విధములైన ప్రేమములకు వర్తింపదు.

(ఆ) లౌకికమైన తమ స్వప్రయోజనముల నిమిత్తము గాని, మనోబలము కొరకుఁ గాని స్త్రీపురుషు లండొరుల మీఁద నాధారపడనప్పుడు వారి మధ్య ప్రేమ మంకురింపదు. అంతకుముం దంకురించినను అది అంతరించే నని భావము.కనుకఁ గుటుంబమేర్పడదు. ఏర్పడినను భగ్నము కావచ్చునని తాత్పర్యము.

(ఇ) ఇది శృంగారేతర ప్రేమములకు సహితము వర్తించేను.

(ఈ) మనోభావమనుటఁ జేసి, స్త్రీపురుష ప్రేమము తన యొక్క తొలుతటి దశలోఁ జెకుముకి ఱాపిడి కెగసిపడు నిప్పుఱవ్వ వంటి భావావేశమే కాని శాశ్వతమగు స్థాయీభావము కాదని సూచనము. కాని దాని నట్లు మార్చు కొనుటకు వ్యవస్థాగతమైన యవకాశము కలదు.

సూత్రము – 17 : **నైసర్గికమగు లింగాంతరానుకంప.**

**వృత్తి :** స్త్రీపురుష ప్రేమము తన యొక్క తొలుతటి దశలో నెదిటి జాతికిఁ జెందినవారిపై కనికరముగా నుండును.

(అ) అనఁగా – స్త్రీలు స్త్రీల పైనను, బురుషులు పురుషుల పైనను సానుభూతి జూపుట పూర్తి నైసర్గికము కాదు. మానవాళి యొక్క సహజావస్థలో నాఁడు

వారు మగవారి యెడలనే మిక్కిలి కనికరమును జూపెదరు. అట్లే మగవారు న్ను ఆఁడువారి యెడలనే మిక్కిలి కనికరమును జూపెదరు. ఇది కొన్నిపట్టు లఁ బరస్పర ప్రేమమునకు దారిసూపును.

సూత్రము – 18 : **వయో నిరపేక్షము.**

**వృత్తి :** ఇద్దఱు మనుషులు ప్రేమించుకొనుటకు వయస్సుతోఁ బని లేదు.

(అ) శృంగారప్రేమము ప్రాథమికముగా బాహ్యాకర్షణమునకు సంబంధిం చినది కనుక, మనుష లకరికంటె నొకరు వయస్సులో నెంత చిన్నవారైనను, బెద్దవారైనను బ్రేమమునఁ దగులవచ్చును.

(ఆ) అట్లే తమ నడుమఁ బురుషాంతర భేదము గల స్త్రీపురుషులు సైతము బ్రేమమునఁ దగులుకొనుట కాస్కారము గలదు.

సూత్రము – 19: **భిన్నహేతుకము.**

**వృత్తి :** పురుషులను స్త్రీలు ప్రేమించుటకున్ను, స్త్రీలను బురుషులు ప్రేమిం చుటకున్ను వేఱువేఱు కారణములుండును.

(అ) అనఁగాఁ – బ్రేమించుట కొఱకు స్త్రీలు పురుషులలో వెదకు లక్షణములు వేఱు. పురుషులు స్త్రీలలో వెదకు లక్షణములు వేఱు. సాధారణముగా స్త్రీలు తమ పురుషులలో ధనార్జనకోవిదత్వము, సరససల్లాప నైపుణ్యము, అనన్య స్వాధీనత, ధైర్యము, శరీరదార్ఢ్యము, లౌకికజీవనచాతుర్యము, ఆలంబనదా యకత్వము, ఔదార్యము, గాంభీర్యము, అన్యాకమనీయత యను పది లక్షణముల నన్వేషింతురు. ఇవి పౌంస్నదశకము. అట్లే పురుషులున్ను తమ స్త్రీలనుండి విధేయత, సౌశీల్యము, గృహకార్యకుశలత, పత్యాశ్రయత , ప్రసన్న త, సర్వతోముఖ మార్దవము, మితభాషిత్వము, లావణ్యము,అను నెన్మిది లక్షణముల నాశింతురు. ఇవి స్త్రైణాష్టకము. అనఁగాఁ బురుషులు స్త్రీలనుండి



మానసిక లాభములను, స్త్రీలు పురుషుల నుండి హెచ్చుగా భౌతికలాభము లను ఆకాంక్షింతురు. కాని స్థానికాచరణములను బట్టి యిందు హెచ్చుతగ్గు లుండవచ్చును. వ్యక్తివిశిష్టములైన గుణములను బట్టియు వ్యత్యాసము లుండును. రతికౌశల– గర్భసాఫల్యాదుల ప్రస్తావన మిక్కడ సంగతము కాదు గనుక పేరుకొనఁబడదయ్యె. అట్టి అనుక్తము లుక్తములయందే అంతర్భ వించునని గమనిక.

(ఆ) అనఁగా స్త్రీపురుషు లెవరి ప్రయోజనములకై వారు ప్రేమించుచున్నారు. ఇట్లు భిన్నప్రయోజనముల నుద్దేశించి సన్నిహితులగువారి యేకీభావము తొలుత భౌతికమైన ఆచరణసౌలభ్యమే గాని యథార్థము కాదు. కాని కాల క్రమమున నట్లు కావచ్చును.

సూత్రము – 20: **ఏకజన లగ్నము.**

**వృత్తి :** మనిషిలోని మిథునభావము ప్రాయికముగా నొక్కటియందే లగ్నమై యుండును. అనఁగా – ఆఁడుదైనను, మగవాఁడైనను దమ జీవితములో నొక్కటినే శృంగారపరముగాఁ బ్రేమింపఁగలరని భావము.

(అ) ప్రపంచములో నొకటిని గాని, పదిమందిని గాని వలచి తుదకు మఱి యొక్కటిని, లేదా నలుగుఱైదుగుఱిని వరుసగా వివాహమాడువారున్ను, వివాహమైనను, గాకపోయినను అక్రమ సంబంధములకుఁ గడంగువారున్ను గోటులాదిమంది యుండవచ్చును. కాని యీ పూనిక యెల్లఁ దమ యాకాం క్షల కనురూపులైన పరిపూర్ణ స్త్రీపురుషమూర్తులు లభింపమిచేతఁ గాని, లేదా తమ కెటువంటివారు కావలెనో తమకే ప్రస్ఫుటముగా నెఱుక లేనప్పుడు గాని సంభవించునని గుఱుతెఱుఁగునది.

(ఆ) కనుక ద్వేష్యములుగాను, దూష్యములుగా భావింపఁబడు పెక్కు భావ ములు వాస్తవమునకుఁ దమ మూలస్థితిలోఁ బరిశుద్ధములే యగును.

(ఇ) మనిషి తన మనస్సులో ననేకాభిమానములకు స్థలమివ్వఁగలిగిన ప్పుడు పలువుఱు ప్రేయసులకుఁ గాని,ప్రియులకుఁ గాని యేక కాలములో స్థలమేల యివ్వలేకపోవును ? అనిన – స్త్రీపురుషసంబంధము తన మౌలిక స్వభావము చేతనే స్వార్థవిశిష్టమైనది. తత్కారణమున నది తప్పనిసరిగా నసూయా కలుషితమయినది. మాతాపితాపుత్రమిత్రాది ఇతర సంబంధములు దానివలె తప్పనిసరిగా స్వార్థవిశిష్టములు కావు.

(ఈ) శృంగారము వేఱు. శృంగారప్రేమము వేఱు.

(ఉ) పరిపూర్ణ పురుషులు గాని, పరిపూర్ణ స్త్రీలు గాని ప్రపంచములో లేరు.

సూత్రము – 21 : **నిర్వికల్పమనఃప్రవర్ధి.**

**వృత్తి :** వికల్పమనఁగా విఘ్నము. ప్రేమము ప్రాథమికముగా నొక మనో భావమగుటఁ జేసి యా మనస్సున కితరేతరములగు నేకాగ్రతాభంగము లు లేని స్థితిలో నది తద్దయు నభ్యుదయముఁ గాంచును.

(ఆ) ప్రేమమున కేకాగ్రతాభంగములు పలుతెఱఁగులు. జనాంతర మోహ ము, ధనాధికార–పదవీ–ప్రభృతివాంఛలు, నికృష్టమైన పేదఱికము, అతివేల ములైన ప్రేమేతర భావోద్వేగముల పొంగు, కళాశాస్త్రాదివ్యసనములు, మెట్ట వేదాంతములు, బహుళ లోకపరిజ్ఞానములచే ననావశ్యకముగా మోతెక్కిన మనస్సు, ప్రేమమునుండి గామమును విడఁదీసి యోచించుట – ఇయ్యవి ప్రేమాస్పదులను నిర్మలముగాఁ బ్రేమించేట కాటంకములగును.

సూత్రము – 22 : **ప్రేమాంతర ప్రతిష్ఠాయి.**

**వృత్తి :** ప్రతిష్ఠానమనఁగా నాలంబనము. శృంగారప్రేమ మితర విధములగు ప్రేమములపై నాధారపడి యుండును.



(అ) ప్రియప్రేయసులను సరిగా మన్నించేటకు ముం దితర మానవ సంబం ధములను లెస్సగా మన్నించేట తెలిసినవారు తమ శృంగారప్రేమమును సైతము నిలుకడఁ జేసికొనఁగలరు.

(ఆ) తన తల్లి తన తండ్రిని మన్నించే పైనమే ప్రాయికముగాఁ దన ప్రేమా స్పదుని మన్నించేటలో స్త్రీకి మార్గదర్శకము. అట్లే తన తండ్రి తన తల్లిని మన్నించే పైనమే ప్రాయికముగాఁ దన ప్రేమాస్పదురాలిని మన్నించేటలో మగవానికిని ఆదర్శప్రాయము.

(ఇ) ఇక్కారణమున మంచి సంప్రదాయము గల కుటుంబములతో వివాహ సంబంధమున కుత్సహించేవారు హెచ్చు.

(ఈ) శృంగారమున కంటె వేఱుగాఁ దమ యాత్మలకున్ను, మనోబుద్ధి – అహంకారములకున్ను తృప్తియొనరించే నితర ప్రేమములున్ను, అంతర్గతా భిమానములున్ను మఱియుఁ దమ వర్తమాన స్థితిస్థాయిలున్ను సరిపోలిన ప్పుడు ప్రేమికుల ప్రేమము గాఢమగును.

సూత్రము – 23 : **విషయాంతరానురోధి.**

**వృత్తి :** ప్రేమ మేర్పడుటయు, నిలచేటయు, ఫలవంతమగుటయు నన్నవి ప్రేమికుల సంకల్పశక్తికి మించిన పెక్కితర విషయములపై నాధారపడును.

**(అ) శృంగార ప్రేమము విషయములో :**– ఒకరి ప్రేమమునకుఁ బోటి యేర్పడినప్పుడున్ను ;పెద్దలు గాని, సమాజము గాని, ప్రభుత్వము గాని వారి ప్రేమము నంగీకరింపనప్పుడున్ను ; ఎవ్వరి జోక్యమున్ను లేకయే కొన్ని ప్రత్యేక పరిస్థితుల మూలమునను ; లేక వారివారి ప్రత్యేక యోచనవిధానము వలనఁ బ్రియప్రేయసుల నడుమ నపార్థములేర్పడినప్పుడున్ను ; దైవికముగా వారు విడిపోవలసివచ్చినప్పుడున్ను ; అంతకుముందుఁ బ్రేమ మేర్పడినను

అది నిలచేటయు, ఫలవంతమగుటయు సందేహాస్పదములగును.

(ఆ) 14 వ సూత్రపు వృత్తిలో (ఆ) అను గద్యతోఁ గలిపి దీనిని జేదువునది. తమ స్థానమున కపచారము సేయువారిని దల్లిదండ్రులు సైతము సైఁపఁ జాలరని యెఱుఁగునది.

సూత్రము – 24 : **పూర్వసంస్కార ప్రతిబోధి.**

**వృత్తి :** మఱపునకు వచ్చిన మధురోహలున్ను, మనస్సు యొక్క లోలోపలి పొఱలలో నిదురించిన మార్మిక భావములున్ను ఒకానొకటి సాంగత్యమున మేల్కాంచినప్పుడు వారిపై ప్రేమము మొలకెత్తును.

(అ) 14 వ సూత్రముతో దీనిని గలిపి చేదువునది. తన నిగూఢ భావములు తన యాత్మీయతలలో నేకదేశము.

(ఆ) కనుక నొకఱ క విషయమును గాని, మనిషిని గాని బ్రేమించుచున్నా రనఁగా – వారట్లు ప్రేమింపఁగోరుచున్నారు గనుకఁ బ్రేమించుచున్నారని భావము. కాని యా సంగతి వారికే తెలియకపోవచ్చును.

సూత్రము – 25 : **ప్రేమాస్పదుల యెడ గుణదోష తూష్ణీంభావి.**

**వృత్తి :** దీనిని 19వ సూత్రముతోఁ గలిపి చేదువునది. తూష్ణీంభావ మనఁగా నుపేక్ష. నిజమైన ప్రేమము తన ప్రేమాస్పదుల వర్ణనశక్యమైన సద్గుణము ల కారణముగా నేర్పడదు. అట్లే వారి దోషముల కారణముగా నంతరింపను అంతరింపదు. అది వారి గుణదోష నిరూపణప్రసంగము నెడల యథాసంభవ ముగా నుపేక్షాభావమును వహించును.

(అ) ఇది ప్రేమాంకుర దశ తాలూకు మనః స్థితి కాదు.

(ఆ) తమ ప్రేమాస్పదుల గుణదోషములపై తీర్పులిచ్చు నభ్యాసము గల

.



వారున్ను, అట్టి తీర్పుల ననుసరించి ప్రవర్తించువారున్ను వారి పట్ల తమ ప్రేమమును శీఘ్రముగాఁ గోలుపోవుటయే కాక, వారికిఁ దమ యందున్న ప్రేమమును సైతము శాశ్వతముగాఁ బోఁగొట్టుకొందురు.

సూత్రము – 26 : **గౌరవానులోమము.**

**వృత్తి :** ప్రేమము హెచ్చిన కొలఁది గౌరవము హెచ్చును. గౌరవము తగ్గిన కొలఁది ప్రేమము తగ్గును.

(అ) గౌరవమనఁగా నాత్మాశక్యములగు నర్థముల యెడ నద్భుత రసాస్వాద నము.

(అ) ప్రేమము వాసనాజన్యము కాఁగా గౌరవము జ్ఞానజన్యము. కనుక గౌరవింపనిదే ప్రేమింపఁజాలని తత్త్వమున్నప్పటికిన్ని గౌరవప్రేమములు ఒక్కటి కావు. సాహచర్యము లోపించినంతనే శృంగారప్రేమము తగ్గును. కనుకఁ బ్రేమము స్వతహాగా స్థాయీభావము కాదు. కామమూలకమైన యువ ప్రేమములు కాలక్రమములో స్థాయీభావములుగా మారుట కవకాశము కలదు.

సూత్రము – 27 : **ప్రేమప్రదాన ప్రత్యాశంసి.**

**వృత్తి :** ప్రేమము తిరిగి ప్రేమము నాశించును.

(అ) అనఁగా – ప్రేమించినవారు, తాము కురియించుచున్న ప్రేమమునకు బదులుగాఁ బ్రేమమే రావలెనని యెదురుసూచెదరు. ఇది శృంగారేతర ప్రేమములకు సైతము వర్తించును.

(ఆ) తరువాతి కాలమున హక్కులు, కృతజ్ఞతలు, కర్తవ్యములు, బాధ్యతలు అను పేళ్ళతోఁ బ్రచురమైన చట్టములకున్ను, స్థానములకున్ను, వృత్తుల కున్ను, పదోన్నతులకున్ను ఇదియే బీజము.

సూత్రము – 28 : **సుతారపు సంయమనము.**

**వృత్తి :** ఆదేశోపదేశాదుల నపేక్షింపకే యెదిరి విజనుస్సునందలి ప్రేమము వలన జనులు తమ్ముఁ దాము పెక్కింట నిగ్రహించుకొని సరిదిద్దుకొందురు.

సూత్రము – 29 : **ప్రతిద్వంద్వాసహము.**

**వృత్తి :** ప్రతిద్వంద్వమనఁగాఁ బోటి. ప్రేమము పోటిని సహింపదు.

(అ) 14 వ సూత్రమును మఱియు 21 వ సూత్రమును దీనితోఁ గలిపి చేదువునది. ఇది శృంగారేతర ప్రేమములకు సహితము వర్తించును.

(ఆ) పోటిగా వచ్చువారు శత్రుభావముతోఁ జూడఁబడుదురు గనుకను, వైరశుద్ధి కవకాశముండుట చేతను, ఆ భయముతోఁ బ్రియప్రేయసుల నడుమ నిలచుట కెవ్వఱును సాహసింపరు. వైరశుద్ధి యనఁగాఁ బగఁదీర్చు కొనుట.

(ఇ) ఆ భయమే యనేకాదర్శములకును, వ్యవస్థలకును ఆరంభ బిందువు.

సూత్రము – 30 : **ఉత్సాహాపేక్షము.**

**వృత్తి :** ప్రేమించుట కుత్సాహము కావలెను. దీనినే ఊఁపు అనియుఁ జెప్పి కొనవచ్చును.

(అ) ఉత్సాహము లేదా ఊఁపు ప్రధానముగా శారీరిక బలము మీఁదను యౌవనము మీఁదను ఆధారపడి యుండును. ఇక్కడ యౌవనమనఁగాఁ గేవలము వయస్సే కాక పూర్వానుభవ ముద్రాచ్ఛిద్రము కానటువంటి నిర్మల మనఃస్థితి అనియుఁ జెప్పికొనవచ్చును. శారీరికబల మాత్మవిశ్వాస మును బ్రోదిసేసి యితరుల మంచిసెబ్బఱల బాధ్యతను సహితము చేపట్టుట కావశ్య కమైన మనోబలమును, మానసిక పరిపక్వతను ఇచ్చును.

(ఆ) యౌవనము శాశ్వతము కాదనియు, తొలిప్రేమమాకర్షణము మాత్రమే



యనియు, నయ్యది యౌవనగ్రంథుల చిద్విలాసము మట్టుకే యనియు, నే మగవాడైనను, లేదా యే మగువయైనను ఒక్కటియే యనియు, పెండ్లి తరువాత మోజ్ తీఱిపోవుననియు, స్త్రీపురుషులను నమ్మరాదనియు – ఈ విధములైన నిరాశాపూరితములైన మెట్టవేదాంతములును, ముదురు మాటలును, ముసలిమాటలును ప్రేమోత్సాహమునకు గొడ్డలిపెట్లు. ఈ విధమైన నమ్మికలుగలవారు ప్రేమమునకే కాక పెండ్లికి సైత మనార్హులు.

(ఇ) ప్రేమవ్యవహారములో వంచనకు బలియగుట వలన సైతము ప్రేమో త్సాహము శాశ్వతముగా క్షీణింపవచ్చును.

## :: మూఁడవ ప్రస్తావనము – కామతత్త్వము ::

సూత్రము – 31 : **విజనుస్సు లోఁడొరులకు విభూములు.**

**వృత్తి :** విజనుస్సులనఁగా స్త్రీపురుషజాతులు. వీనికే ప్రథమ, ద్వితీయ ప్రకృతులని సంజ్ఞ. ప్రథమప్రకృతులగు నాఁడువారు ద్వితీయప్రకృతులగు మగవారికి విదేశీయులు. అట్లే మగవా రాఁడు వారికిని విదేశీయులు. వారికిన్ని వీరు బోధపడరు. వీరికిన్ని వారు బోధపడరని యుద్దిష్టార్థము.

సూత్రము – 32 : **కామము.**

**వృత్తి :** ఇది యధికార సూత్రము. దీనినిఁ దరువాతి పదమూఁడు (13) వెనువెంటి సూత్రములకు ననువర్తించుకొనునది. ఈ కామమునే కొలఁది పురాతనగ్రంథములలో రతి యని వ్యవహరించిరి.

సూత్రము – 33 : **రెండు మూలతత్త్వముల ప్రతినివర్తనాసక్తి.**

**వృత్తి :** ప్రతినివర్తనమనఁగా వెనుకకు మఱలుట. స్త్రీతత్త్వమును, పురుష తత్త్వమును తాము వేఱుగా నేర్పడక యొక్కటియై యున్న యాదిమస్థితికిఁ

దిరిగి మఱలఁగోరుటయే కామము.

(అ) ఇక్కడ స్త్రీతత్త్వము, పురుషతత్త్వ మని పేరుకొనుట జనసామాన్యపు టవగాహన కొఱకే. ఇవి వాస్తవమునకు స్థితిశీల, గతిశీలశక్తులని యెఱుఁగునది. ఎట్టులనఁగా – ఒక దీపమునందు దాని ప్రమిద స్థితిశీలము. దానిలోని నూనె గతిశీలము. సృష్టిలోని ప్రతివస్తువున్ను ఇట్లే యీ యిఱుతత్త్వముల కలయికతో నేర్పడి యున్నది.

(ఆ) స్త్రీ పురుషులని రెండు తత్త్వములు వేఱువేఱుగా లేని స్థితి కూడ నొకప్పుడుండెడిదని భావము. అధమతరగతి జీవులలో నిప్పటికిని ఆ స్థితి కలదు.

(ఇ) గతిశీలతత్త్వము ఉన్నత జీవస్థితియందుఁ బురుషత్వమని పిలువఁబడును. స్థితిశీలతత్త్వము ఉన్నత జీవస్థితియందు స్త్రీత్వమని పిలువఁబడును.

సూత్రము – 34 : **పీఠోద్గత చైతన్యము.**

**వృత్తి :** పీఠస్థానమనఁగా నాసనాంగము. కామ మారోగ్యవంతమైన జీవుల యాసనము ద్వారా ప్రవర్తించు చైతన్యము. జాగ్రుతవాంఛా స్థితిలో నిది మానసికము కాదు.

(అ) కామము తన సుప్తవాంఛా స్థితిలో నెదిరి తత్త్వముమీఁదఁ బ్రేమ, గౌరవాదరాభిమాన, సానుభూతుల రూపమున వ్యక్తమగును. ఆ యెదిరి తత్త్వ మెవనైనను గావచ్చును. దీనిని 17 వ సూత్రముతోఁ గలిపి చదువునది.

(అ) ఆసనస్థానము మలవిసర్జనావయవము. మట్టి నుండి యుద్భవించిన యాహారము తిరిగి మట్టిగా మారి యాసనమునుండి బయల్వెడలి మఱల మట్టిని జేరి మట్టిలోఁ గలిసిపోవును. మానవ చైతన్య మక్కడనే నిలిచి యున్నప్పుడు మట్టి సంబంధమగు కోరికలున్ను, తలఁపులున్నుపెచ్చెఱిల్లును.

(ఆ) మట్టి స్వభావము మొలకెత్తించుట గనుక సంతానోత్పాదన ప్రేరణ



మున్ను భూమిరూపేణ, ఇంటిరూపేణ మట్టిని మఱియుఁ దజ్జనితములైన వస్తుసంచయముల ఆర్జనప్రేరణమున్ను కలుగును.

సూత్రము – 35 : **కొండొకచోఁ బ్రేమమునకుఁ బరాకాష్ఠ.**

**వృత్తి :** ప్రేమము నిర్భరమైనప్పు డది తాత్కాలికముగాఁ గామముగాఁ బరిణమించును. కామము నిర్భరమైనప్పు డది కూడఁ దాత్కాలికముగాఁ బ్రేమముగాఁ బరిణమించును. ఆ స్థితియందుఁ బ్రేమ–కామముల నడుమ విభజనరేఖ గుఱుతింపరానంత సూక్ష్మమున్ను, యదృశ్యప్రాయమున్ను అయి యుండును.

సూత్రము – 36 : **ఒక వేదనము.**

**వృత్తి :** ఇట వేదనమనఁగా బాధ. బాధ యనఁగాఁ దనకుఁ దాను దఱచుగా జ్ఞాపకమునకు వచ్చుట. కామము గలవారు శూన్యహృదయులయి యది యుపశమించు వఱ కంతర్ముఖత్వముతో నుందురు.

(అ) కామ మాఁకలి వలెను, గాయముల వలెను ఒకానొక వేదనము కనుక యొక జీవుని యుత్పత్తి వేఱక జీవుని వేదనమునుండియుఁ దదుపశమనము నుండియు జఱుగుచుండుట సుబోధము.

సూత్రము – 37 : **ఆత్మాస్వాదన నిమిత్తము.**

**వృత్తి :** తన కామము తనను దా ననుభవించుట కొఱకు.

(అ) మైథునమునం దాఁడుది తన యాఁడుతనమును, మగవాఁడు తన మగతనమును అనుభవించెదరు. అనఁగా నెవఱిని వారే యనుభవించెదరని భావము. ఇది మైథునమునకుఁ గల సంతానేతర ప్రయోజనము.

(ఆ) ఇట్లు తన్నుఁ దాననుభవించుటచే స్వవిజనుర్అనుసారము తన లౌకిక

కౌటుంబిక కర్తవ్యముల స్పృహ దృఢతరమగును.అది తన విజనుః స్వభావము నినుమడింపఁజేసి యితరుల కాదర్శప్రాయమైన లౌకిక పాత్రములను బోషింపఁజేయును. కనుక సామాన్యులకుఁ గామానుభవ మనివార్యము.

సూత్రము – 38 : **సంతానార్థము.**

**వృత్తి :** కామము సంతానమును బోందుటకు దారితీయును.

(అ) కామమనఁగాఁ బ్రకృతి నుండి యాహారద్వారమునఁ బోందిన శక్తి నామెకే సంతానరూపములోఁ బ్రత్యర్పించేటకై కలుగు ప్రాకృతికప్రేరణమున్ను.

(ఆ) సంతానమును బోందనిదే ప్రథమ సమాజము ప్రత్యక్షసమాజముగా మారఁజాలదు. మానవశిశువులు పరిపూర్ణ వ్యక్తిత్వము సంతరించేకొనుటకు గనీసము పదునెన్మిదేండ్లు పట్టును. వారు జంతుశాబకముల వలె నొక్క పెద్ద వద్దనే పెఱుగుట వారి సమగ్రవ్యక్తిత్వమునకు దోహదకారి కాదు. పెఱిగి పెద్దవారైన పిల్లలలోని సహజమైన మానవీయహేతువాదమొక్క పెద్ద వద్దనే ఆఁగిపోదు. మనిషి తన మూలములను సర్వదా శోధించేను. పిల్ల నెవ్వఁడో యొక్కఁడే పెంచేట స్వాభావిక పరిస్థితులలో సంభవముకాదు. కనుకఁ దమ శుక్రశోణితముల కలయికతో జన్మించినారను కారణమున బిడ్డల పట్లఁ బెద్దలలో సమానమైన మమకారభావమును బెంపొందించేటకే ప్రకృతి మాత మానవులకు సైతము మైథున పద్ధతినే విధించియున్నది. కాని యిది తిర్యక్కులలోఁ బ్రధానముగాఁ బ్రాణిసంఖ్యానియంత్రణమునకే యుపయుక్తము.

(ఇ) ప్రత్యక్ష సమాజ మేర్పడనిదే ప్రథమ సమాజమునందు బాధ్యతాభావ మంకురింపదు.

(ఈ) ప్రథమ సమాజములయందు బాధ్యతాభావము కొఱవడిన యెడలఁ బరోక్ష సమాజమునందలి యుపవ్యవస్థలు సైతము కాలక్రమమున శిథిలీభవింపఁగలవు.



సూత్రము – 39 : **వివాహమునకై ప్రలోభము.**

**వృత్తి :** మానవులు వివాహముఁ జేసికొనుటకుఁ గామమొక ప్రోద్బలము.

(అ) బుద్ధిహీన జీవులకంటె సున్నితహృదయులున్ను, సునిశిత మేధస్కులున్ను, అంతర్ముఖులున్ను, ఊహాపోహ విశారదులున్ను అగువారే కామపరమైన వక్రబుద్ధులకున్ను, భ్రష్టాచారములకున్ను లోనగు నవకాశము కలదు. ఉన్నత తరగతికిఁ జెందిన జీవులలోఁ గామానుభవ మల్పవ్యవధానకమున్ను, కించిద్రుచ్యమున్ను అగుట వలన దానినిఁ బొడిగించేటకున్ను మిక్కిలి రుచింపఁజేసి ఒకొనుటకున్ను కొందఱికి వివిధ భ్రష్టాచారము లవసరము కావచ్చును.

(ఆ) జంతువులందు వలె మానవులందు ఋతునియమము లేదు, కాబట్టి మానవులు కామము నెంతగాఁ దృప్తిపఱచుకొన్నను అది వారికి మిక్కిలి తఱచు కలుగుచునే యుండును. కనుక దాని నెప్పటికప్పుడు చల్లార్చుటకు స్థిరమున్ను, శాశ్వతమున్ను అయిన యేర్పాటకటి కావలెను. వివాహము చేసికొనుటయే అట్టి యేర్పాటు. పెక్కుతిర్యక్కులయం దేడాది పొడవున రమించే తత్త్వము లేకపోవుట వలన వానికి వివాహ మావశ్యకము కాదు.

సూత్రము – 40 : **ఒక మహాశక్తి.**

**వృత్తి :** శక్తి యనఁగా నొక పెనుపరిణామప్రక్రియను బ్రవర్తింపఁజేయు మౌలిక చోదనము. కామము కూడ నటువంటి యొక గొప్ప మాస్తికము.

(అ) సృష్టిలోఁ బెక్కు శక్తులు గలవు. కాని కామశక్తి జీవుల లోపలి నుండి ప్రవర్తించేనది.

(ఆ) కామానుభవము రెండు మూలతత్త్వముల ప్రతినివర్తనాసక్తిని దీర్చుటయే కాక, తదనంతరము వైయక్తిక స్వభావమునందును, సమాజవ్యవస్థ

యందును ప్రభావమును గలిగించేను. అదిప్రపంచమును జీవన యోగ్యముగానే కాక, అనుభవయోగ్యముగాఁ గూడఁ బ్రదర్శించేను. అది మనిషిని గర్మగానే కాక కర్తగా సహితము రూపించేను. అందుచేత నా యనుభవాభిలాషము మనిషియందు యాజమాన్యపు హక్కులకై ప్రేరణమును గేలిగించేను. తత్కారణమునఁ దాను బ్రపంచమున కొక యభ్యాగతి నను విషయమును మనిషి మఱచిపోవును. ఇది యొక పెనుపరిణామము.

(ఇ) కామమొక మహాశక్తి యనుటచేత దానితోడి విశృంఖల హేల బహు ప్రమాదభరితమని తాత్పర్యము. కనుక దాని తోడి ప్రయోగములు పూర్తిగా నియంత్రితములున్ను, సురక్షితములున్ను అయిన పరిస్థితులలో మట్టుకే హానివిరహితములగును. నియంత్రిత పరిస్థితులనఁగా గురుజనోపదేశ ప్రకారమైన బహిరంగ వివాహోపక్రాంతమగు కుటుంబజీవన విధానము.

(ఈ) బుద్ధి వికసించినప్పుడు దానికి విషయములు కావలెను. నిప్పు రగిలినప్పుడు దానికి సమిధలు కావలెను. ఇట్లే ప్రతిశక్తికిని దా నుద్బుద్ధమైన పిమ్మట నుపభోగ్యమైన ద్రవ్య మాత్మాదృశమొక్కటి కావలెను. ఒక శక్తి మఱియొక శక్తికిఁ బ్రత్యర్థి. కాని ఏ శక్తిని గాని అచ్చేముగాఁ దనియింపఁజాలము. అట్లే యే శక్తిని గాని పూర్తిగా నిర్వాణమును బొందింపఁజాలము. కాని వానిని సముచిత మార్గమున స్రవంతీకరించి, తాత్కాలికముగా నుపశమింపించేట వలననే వానియందలి గురుతరలాభములను బొందఁగల్గుదుము. ఆ విధముగా వాని వలని ముప్పులను సహితము పరిహరింపఁగల్గుదుము.

సూత్రము – 41 : **శ్రేష్ఠుల సమాగమమునఁ గృతార్థమ్మన్యము.**

**వృత్తి :** శ్రేష్ఠుఁడైన పురుషునిఁ బొందిన స్త్రీ కామమున్ను, అట్లే శ్రేష్ఠురాలైన స్త్రీని బొందిన పురుషుని కామమున్ను తృప్తిఁజెందినట్లున్ను, తమ జన్మ ధన్యమైనట్లున్ను తోఁచేను. అనఁగా శృంగారప్రేమమునకు గౌరవము తోడైనప్పుడది నిర్భరము.



(అ) శ్రేష్ఠాశ్రేష్ఠ విచారము దేశకాల సాపేక్షము మఱియు వ్యక్తి విచక్షణాధీనము. అనఁగా నెవఱికి వారు తమ వివేకమును బట్టి యోచించుకొనునట్టిది.

(ఆ) మానవులలోఁ గామమొక శారీరిక క్రీడగానే కాక, వారి తెలివితేఁటల మూలమున మానసిక వస్తువుగాఁ గూడ మారియుండుట చేత సంభోగమునకంటె సంభోగ్యవ్యక్తియే శ్రద్ధాస్థానమగును. తమకంటె వేఱైన లక్షణములున్న వ్యక్తుల పట్ల నాకర్ష ణము మెండు. ప్రేమకామముల నడుమఁ గల తేడాలలో నిది ముఖ్యమైనది.

(ఇ) దీనిని 35 వ సూత్రముతోఁ గలిపి చేదువునది. శ్రేష్ఠులను శాశ్వతముగా స్వంతముఁ జేసికొనుటకు సంఘసమ్మతిని బడసిన సాంప్రదాయిక విధివిధానము పెండ్లి.

సూత్రము – 42 : **వ్యక్తికేంద్రకము కానిది.**

**వృత్తి :** శృంగారప్రేమమువలెఁ గామ మొకానొక ప్రత్యేక వ్యక్తిని గాని, కొందఱు వ్యక్తులను గాని యాశ్రయించేకొనియుండదు. అనఁగా వ్యక్తిపరమగు నుపాధి దానికి సంగతము కాదు.

(అ) దీనిని 30 వ సూత్రముతోఁ గలిపి చేదువునది. దీనివలన మానవులలోఁ గామపరమైన భ్రష్టాచారముల కాస్కార మేర్పడును.

సూత్రము – 43 : **ఔషధప్రాయముగాఁ బ్రభావశాలి.**

**వృత్తి :** కామమును మందు వలె మితముగా సేవించినప్పు డది సత్ఫలితములిచ్చెను.

(అ) కామమొక మహాశక్తి యయినను, దానికిఁ బ్రధానతా ప్రతిపత్తి లేదు.

అది యితర మానవ సంబంధములను దండగా గుదిగ్రుచ్చెడి దారము మాత్రమే. తాను స్వయముగా దండ కాదు. అది యెట్లంటేని – ఒకానొకనికిఁ దన పెండ్లాము పట్ల సుప్తకామ మతిశయించినచో నామె యాతనికిఁ బ్రాణేశ్వరి యగును. ఆమెతోఁ బాటుగా నామె పుట్టినింటివారున్ను, ఆమె నేస్తములున్ను తన కాప్తవర్గమగుదురు. తన ద్వారమున ఆమెకు జనించిన బిడ్డలు సహిత మాతనికిఁ బ్రియతములగుదురు. ఏతద్విపర్యయము నూహించేనది.

(ఆ) పక్షాంతరమునఁ – గామమును దమ మతముగా మార్చుకొని, వివిధములైన కామానుభవములను బోందుటయే ధ్యేయముగా నడచేకొనువారి విషయమునఁ గామము తన పూలదండదారపు స్వభావమును గోల్పోవును. అనఁగా నది పూర్వము వలె మానవ సంబంధములను నిర్మించేటలో ఘోరముగా విఫలమగును. అతిభోగవశమున నందలి యాస్వాదనీయత యెప్పటికప్పుడు పలుచేఁబడుట చేత నాత్మోద్రేకమును, నిత్యనూతనతను, అనుభవవైవిధ్యమును అర్థించి, లోకోత్తరములయిన భ్రష్టాచారములను మఱుగుటకు సహిత మవకాశము గలదు.

(ఇ) ఇయ్యది మిథునములకున్ను.

సూత్రము – 44 : **అత్యుపస్థము.**

**వృత్తి :** దీనిని 34 వ సూత్రముతోఁ గలిపి చేదువునది. ఉపస్థమనఁగా గుహ్యాంగము. కామము స్త్రీపురుష గుహ్యాంగముల పరిధి నతిక్రమించినట్టిది. అనఁగా మించినట్టిదని భావము.

(అ) కామప్రవృత్తి సాధారణముగా మానవుల గుహ్యాంగ స్పందనముల ద్వారమున వ్యక్తమగునట్టిదైనను, అట్లు వ్యక్తముకాని స్థితియం దది యనేకములగు నితరేతర మార్గములలోఁ దనను దాను బయల్పఱచికొనును. ఇచ్చటఁ



గామమున కిచ్చాసామాన్యమను నైఘంటికార్థము సంగతము కాదు.

(ఆ) కామమొక చంచల మనోభావము కాక యొక మహాశక్తి యగుటచే నది మైథున, సంతానోత్పాదనముల కంటె భిన్నమైన పెక్కితర ధర్మములను మాఱువేషమున నిర్వర్తించేచేండును. అందుచే దానికిని, దాని మాఱువేషములకున్ను సంబంధము లేదని ప్రాకృతులు భ్రమయుదరు. అది యెట్లంటేని – ఒక్కటియే నిప్పు వంటకున్ను, పచ్చికుండలను గాల్చేటకున్ను, పనిముట్లు సేయుటకున్ను, కొంపలంటించేటకున్ను సమానముగా బనికి వచ్చును. అట్లే ఒక్కటియే కామము మిథునధర్మమునకున్ను, గ్రంథరచనమునకున్ను, కళాకోవిదత్వమునకున్ను, ధనసంపాదన నైపుణ్యమునకున్ను, దేశభక్తికిని, దైవభక్తికిని, బ్రజానాయకత్వమునకున్ను ప్రేరకమగును.

(ఇ) నపుంసకులకున్ను, నిర్లింగ జీవులకున్ను, ముదుసళ్ళకున్ను సహితము కామముండును గనుక దానినిఁ దాత్కాలికముగా నుపశమింపింపవచ్చును, దాఁపవచ్చును, నిర్లక్ష్యము సేయవచ్చును, నిద్రాణముగా నుంపవచ్చును, ఉన్నితింపవచ్చును. స్రవంతీకరింపవచ్చును. కాని యది సర్వాంతర్యామియైన మహాశక్తి యగుటచే దానినిఁ దనుపుటయు, గెలుచేటయు, నిర్మూలించేటయుఁ గుదురని పనులు. ఆ విధమైన బోధలున్ను, ప్రకటనములున్ను విశ్వసనీయములు కావని యెఱుఁగునది. ఇది యొక మార్గదర్శక సూత్రము.

(ఈ) కామప్రవృత్తి గుణదోష సమ్మేళనము. అది యనేకరూపములలో వ్యక్తమగు మహాశక్తి యగుటచే దానిని నిజముగా నిర్మూలింపఁగల్గిన యెడల దాని నున్నతించేకొనఁజాలని సామాన్యమానవులలో ననేక ప్రతిభాపాటవములున్ను, ఆసక్తులున్ను నశింపవచ్చును. తద్ద్వారమున మానవ నాగరికతకే ముప్పేర్పడవచ్చునని గ్రహించునది. ఇది యొక మార్గదర్శక సూత్రము.

సూత్రము – 45 : **మిథునధర్మము మైథునాతిక్రాంతము.**

వృత్తి : స్త్రీపురుష యుగ్మమునందొకమారు నిశ్చితమైన దాంపత్యభావము రతిప్రయోజనము నతిక్రమించి వారి ప్రకృతులయం దనేకములైన యిత రేతర చింతనములను బ్రభావింపఁజేయును.

(ఈ) కామమునందలి దివ్యత్వమును దర్శించు టభినందనీయము. తమ కామమును దమ ప్రేమమునకు విస్తరణభూతముగాఁ గలిగియుండుట కృతార్థత్వము. అగమ్యగమనాకర్షణముల నధిగమించి తమ వాఙ్మనశ్శరీ రములను శుచిగా నుంచుకొనుట మాన్యతమము. కామానుభవానంతర మున దాని స్మృతిని బునశ్చరణ సేయమి సకలలోక నమస్కృతము. రతి పుత్రేతరప్రయోజనసిద్ధి నర్థించి తమ గుహ్యాంగముల నాయుధములుగా నుపయోగింపని సర్వోత్తమస్త్రీపురుషుల మహామార్గము సర్వదా సంస్తవ నీయము. ఇది యొక మార్గదర్శక సూత్రము.

## :: నాలుఁగవ ప్రస్తావనము – పెండ్లి కాఁకడ ::

సూత్రము – 46 : **పని ముందు, ప్రయోజనము తరువాత.**

వృత్తి : మానవులు తమ హృదయమునకు హత్తికొన్న పనిని జేసినప్పుడెల్ల దానికిఁ బ్రయోజనమన్నది కాలక్రమమున దానికదియే యేర్పడెను. ఇది యఘాతుక ప్రకృతులను గుఱించి చెప్పిన మాట.

(అ) స్త్రీపురుషసంబంధమునకుఁ గల ప్రయోజనము పూర్వతరముల యను భవమును బట్టి నిర్ధారింపఁబడినను, బ్రతి యర్వాచీన తరమునకున్ను అది సరిక్రొత్తదే యగును గాన నన్యోన్యానురక్తులైన స్త్రీపురుషులకుఁ గలిసి యుండవలెనను హృదయప్రేరణమే తప్ప నా సమయములో సహజీవన ప్రయోజనములపై వారి సావధాన మేకాగ్రమై యుండదు.



(ఆ) ఈ సూత్ర మితరత్ర సైత మనుసంధేయము. దీనికి విపర్యయమగు నాలోచన సరళి ప్రయోజనములను రుచిచూచిన యానక యేర్పడునట్టిది మాత్రమే.

సూత్రము – 47 : **ప్రేమము స్థాయీభూతమైనప్పుడు నిర్దుష్టము.**

వృత్తి : స్థాయీభావమనఁగా నిలుకడ. ఒక్కటియందే యాజీవితాంతమున్ను ప్రేమమును నిలిపికొన్నపట్టుల నది నిష్కళంకమయిన ప్రేమము.

(అ) పరిస్థితులను బట్టి తఱచుగా మారిపోవు మన్నన ప్రేమసూచకము కా దని తాత్పర్యము.

(ఆ) కాని స్థాయీభూత ప్రేమము యువప్రేమము వలె నూహోత్ప్రేక్షలతోఁ గూడికొన్నది కాకపోవచ్చును.

(ఇ) ప్రేమ స్థాయీభావ సాధనకుఁ బెండ్లి యేకైక మార్గము.

(ఈ) ప్రేమమును, ధర్మమును, మేధస్సును యావజ్జీవితముగా సాధన చేయవలసినదే. ఎడనెడ వైఫల్యములు సాధనచేత సంస్కరణీయములు. ఇది యొక మార్గదర్శకసూత్రము.

సూత్రము – 48 : **పెండ్లి .**

వృత్తి : ఇది యధికారసూత్రము. దీనినిఁ దరువాతి పదమూఁడు (13) వెనువెంటి సూత్రముల కనువర్తించుకొనునది.

సూత్రము – 49 : **ప్రథమ సమాజపు స్వచ్ఛంద సహజీవనమున కితర సమాజముల సమ్మతి.**

వృత్తి : ప్రథమ సమాజ మనఁగా నొక స్త్రీపురుష మిథునము. ఇతరు లనఁగా నా స్త్రీపురుషుల ప్రత్యక్ష సమాజములున్ను, వారి పరోక్ష సమాజమున్ను.

ఒక జంట కలిసి జీవింపఁగోరి ప్రత్యక్షపరోక్షసమాజముల యామోదమును గాని, వానిలో నేదియో యొకదాని యామోదమును గాని పడసినప్పు డా కలయిక పెండ్లి యనిపించుకొనును. ఇందులో శాసనప్రసక్తి లేదు.

(అ) ఒక జంట యితరుల ప్రేరణముచేతనే కలిసి జీవింపఁగోరినను అది స్వచ్ఛందమే యగును.

(ఆ) సహజీవనాభిలాషతో సంబంధింపని యితరేతర విషయములు జంటల మధ్య చోటుచేసికొన్నప్పుడు పెండ్లి తన యుద్దిష్ట ప్రయోజనమును గోల్పోవును.

(ఆ) ప్రాచీన గ్రంథముల ప్రమాణము ప్రకార మొక దినుసు పెండ్లికి స్త్రీ పురుషుల యన్యోన్యాంగీకారమే గాని మఱియెవ్వరి సమ్మతియు నక్కఱ లేదు. కాని తమలోఁ దాము వివాహవిధిని జఱిపికొనుట మట్టుకు తప్పనిసరి.

సూత్రము – 50 : **స్వయముగా నొక ప్రమాణము.**

**వృత్తి :** ప్రమాణమనఁగాఁ దాను గైకొన్న యొక నిర్ణయము ననుష్ఠించుటకు స్వచ్ఛందముగాను మఱియు బహిరంగముగాను నిబద్ధతను వెలిబుచ్చుట. పెండ్లి యొక ప్రేమవాగ్దానము.

(అ) వాగ్దానములన్నియు అప్పులే. వానిని నిశ్శేషముగాఁ దీర్చియే తీఱ వలెను, అందులకొక జీవితకాలము పట్టినను బట్టుఁగాక !

(ఆ) అందఱును వాచాకోవిదులు కారు కాఁబట్టి సుస్పష్టముగాఁ బ్రత్యక్షవాఙ్మాలకములు కాకపోయినను బ్రేమమును బదేపదే ప్రకటించుచుఁ జేసిన రహస్యైకాంత సాభిప్రాయచేష్టలు సహిత మాంతరంగికముగా వాగ్దానముల స్వభావము గలిగినవే, యవి ప్రేమాస్పదుల కామోదయోగ్యములైన సందర్భములందు.



(ఇ) స్వయముగా ననుటఁ జేసి పెండ్లికిఁ బ్రభుత్వానుమతి యవసరము కాదని భావము. ఏలనఁ బెండ్లి ప్రభుత్వములకుఁ గారణము కాని ప్రభుత్వము పెండ్లికిఁ గారణము కాదు. పెండ్లి ప్రాథమికముగా మతధార్మికక్రతు వగుటచేఁ దదితరప్రామాణ్యము పెండ్లి కంతర్గతముగా ననుపయుక్తము.

సూత్రము – 51 : **పంచలక్షణ శోభితము.**

**వృత్తి :** పెండ్లి పరిశుభ్రమైన శృంగార సంబంధమునకు నాంది. అది ఐదు (5) లక్షణములు గలదైనప్పుడు మిక్కిలి శోభించును.ఇది యొక మార్గదర్శక సూత్రము.

(అ) ధర్మశృంగారము, అధర్మశృంగార మని శృంగారప్రేమ మిరుతెఱఁగులు. సరూపాభిరుచికమున్ను, స్వచ్ఛందమున్ను, పరస్పర నిబద్ధమున్ను, సర్వథా అన్యోన్యాశ్రితమున్ను, సర్వదా సుఖదుఃఖాది సన్నిహిత సమభాజనమున్ను అగు మానవస్త్రీపురుష మిథునము పూలదండలోని దారమువలె దృశ్యాదృశ్యముగా ననుభవించునది ధర్మశృంగారము. కాని దీనికి విపరీతముగా నధర్మశృంగారము ధర్మశృంగారమునకుఁ గేవల మనుకరణప్రాయమైన యపహాస్యమున్ను, రహస్యమున్ను, కాలక్రమమున బలవంతుల చేతిలో హింసాత్మకమున్ను అగును.

(ఆ) ధర్మమనఁగా – మానవ తర్కమున కంటె భిన్నమైన యదృశ్య సహజ నియమావళి. మనిషియుఁ గొన్ని పర్యాయములు దీనికి దగ్గఱగా వెళ్ళును.

(ఇ) దీనిని 22 వ సూత్రముతోఁ గలిపి చదువునది. స్వార్థ విశిష్టములయిన శృంగారప్రేమాదుల కతీతము లైన వేవియో కొన్ని నిఃస్వార్థ సంబంధము లైనను సమాజమున లేనిదే శృంగారప్రేమములకు సైతము దారితెన్ను లుండవు.

(ఈ) కుటుంబమున్ను మఱియు దాని యుపవ్యవస్థలున్ను వైయక్తికత్యాగ మను పునాదిఱాతిపై నిర్మితములయిన అంతస్తులవారీ కట్టడములే యని గమనించునది.

(ఉ) కాని మానవులు శుష్కనీతిబోధల నుండి కాక సజీవదృష్టాంతముల నుండి మాత్రమే యాదర్శ సందేశార్థములను గ్రహించెదరు. ఈ ప్రక్రియ లో సామాన్యములను విశేషీకరించుటయే కాక, విశేషములను సామాన్యీ కరించుటయు జేఱుగును. కనుక మంచి దృష్టాంతములు విస్తారముగా గోచరింపనిదే వారు నిఃస్వార్థ పథమును గలలోనైన మెట్టఁజాలరు. మనిషికిఁ గుటుంబమే తొలిపాఠశాల కనుక, ముందు కుటుంబమార్గమున నధర్మ కామాచరణమును విడనాడుటతో నిఃస్వార్థత యారంభమగును.

సూత్రము – 52 : **సజాతీకరణము.**

**వృత్తి :** పెండ్లి యను భావము భార్యాభర్తల నొకే విధమైనవారుగా మార్చును.

(అ) భార్యయు, భర్తయుఁ బెండ్లికి ముందు వేఱువేఱు జీవిత నేపథ్యము లకుఁ జెందినవారయినను, బెండ్లి యయిన తరువాత వారిద్దఱున్ను ఒకే జాతికిన్ని, ఒకే మతమునకున్ను, ఒకే కుటుంబమునకున్ను, చెందినవా రగు దురు.

(ఆ) తొలుత స్త్రీపురుషులు పరస్పర మేమైనను, వివాహమైథునప్రజననాద్య నంతరము వారి నడుమ పూర్వపు స్థితిగతులుపసంహృతములగును. వారాం తరంగికముగాను, బహిరంగముగాను శాశ్వత సంపూర్ణ దంపతీత్వమునే ప్రాపించెదరు. తదనుసారము వారి ప్రాంత బంధుమిత్రపరివారాది పరిసర సంబంధములు సహితము పునర్నిరుక్తములగుట లోకానుభవసిద్ధము.

(ఆ) చిరంతనమగు నిరంతర పరస్పర సన్నిహిత సాహచర్య ప్రాబల్యవశమునఁ గాలక్రమములో భార్యాభర్త లేకరూపమైన వ్యక్తిత్వము నభివృద్ధిఁ జేసికొని



యభిన్నవ్యక్తులుగాఁ బరిణమించెదరు.

(ఇ) భౌతిక సంబంధానంతరము మానసికముగా నొకే రక్తమునకు సైతము చెందినవారగుదురు. కనుకఁ గొన్ని దశాబ్దముల దాంపత్య జీవితానంతర మొండొరుల యెడ సోదరసోదరీభావ ముదయించుట కాస్కారము కలదు కాన నతిపరిచయమూలకమగు నవజ్ఞఁ జేసి కొన్నిపట్టుల బాహ్యాకర్ష ణముల బెడద కవకాశముండేడును. దీనిని **సోదరీకరణ**మనవచ్చును.

(ఈ) నిజమైన సజాతీకృతుల మధ్య పరస్పరములే మినహా, వ్యక్తిగతము లుండవు. వా రొకటి వ్యక్తిత్వమునం దింకొక అవిభాజ్యమైన శాశ్వతాంగము. కనుక వారి మధ్య ప్రేమపూర్వకములైన సేవలే తప్ప వైయక్తికములైన హక్కు భుక్తముల యొక్కయు, లాభనష్టముల యొక్కయుఁ బ్రసక్తి దఱిదాపు గా శూన్యము.

సూత్రము – 53 : **అట్టడుగు నుండి నిండుదనము.**

**వృత్తి :** పెండ్లి మానవవ్యక్తిత్వమును గ్రింది నుండి పరిపూర్ణము సేయును.

(అ) **అట్టడుగు నుండి :**– జీవుల యింద్రియములు నీటివలె నధోగమన ప్రవృత్తి గలిగినవి. ప్రతి దినమున్ను మానవుల శరీరములలో ముందు క్రియా శీలములగునవి వారి యధోభాగములు. ఒక సీసాలో నీరు పోయునప్పు డది యే విధముగా నైతే క్రిందినుండియే క్రమముగా నిండుచు వచ్చి కడకు సీసా యొక్క మీఁది యంచును దాఁకునో, యట్లే మానవజీవితమునందు సహితము పరపీడావర్జముగా నీచప్రవృత్తులను ముందు సంతృప్తిపఱుపవలసి యుండును. కొందఱికిది యొక జీవితకాలములోపలనే జేఱుగును. మఱి కొందఱికిది యింకను హెచ్చుకాలము పట్టవచ్చును.

(ఆ) కాలుసేతులున్ను, గుహ్యమున్ను, పొట్టయు మానవ శరీరములోఁ

గ్రింది కభిముఖమగు నవయవములు. వివాహము వలన మానవులకు సహాయ మేర్పడును గావున వారి చలనశీలత హెచ్చును. భౌతికోపాధి యొక్క ప్రతినివర్తనాసక్తి సంతృప్తి జెందును. సమష్టిప్రయత్నము వలన శ్రేష్ఠమైన భోజనసదుపాయము లభించును. అంతట మానవు లంతకంటె నున్నత మయిన హృదయకోశ, బుద్ధికోశాదుల యవసరముల పట్ల శ్రద్ధా సావధాన ములను జూపఁగలరు.

(ఇ) మానవుల యధఃప్రవృత్తులు సాధారణముగా నాఁకలి, కామము, ధన వస్తు సంచయనాభిలాష, యధికారదాహము, వైరశుద్ధి మొదగు వాని నాశ్ర యించి యుండును. పెండ్లి సేసికొని గృహస్థాశ్రమమును స్వీకరించినవారికిఁ గొన్ని నియమములకు లోఁబడి పైనఁ బేర్కొన్న ప్రవృత్తులను దీర్చుకొనుట కొఱకనుమతియు నవకాశమును గలవు. పై ప్రవృత్తులను దీర్చుకొను ప్రయత్న మాత్రమభ్రంశమునకు దారితీయును గావున బ్రహ్మచారులకును, సన్న్యాసులకును ఆ యవకాశము లేదు. అందుచేత నంతి మముగా వివాహ జీవితమా ప్రవృత్తుల నుండి మనిషికుపశమనమిచ్చును.

సూత్రము – 54 : నిజమైన మిథునత్వ సిద్ధి.

**వృత్తి :** నిజమయిన పెండ్లి స్త్రీపురుషులకు నిజమయిన జంటఱికమును బ్రసాదించును. జంటఱికమనఁగా దాంపత్యము. అది నాగరికతాసంస్కృ తుల నిర్మాణము కొఱకు.

(అ) ఇక్కడఁ బెండ్లి యనఁగాఁ గేవలము పెండ్లితంతు కాదు.

(ఆ) కేవల వంశవిస్తరణార్థమైన శుక్రశోణిత మిశ్రణము పెండ్లితో సమానము కాదు. అది కొన్ని మునువలయికలకు లోఁబడి పెండ్లిని గోరుట కర్తతను గల్పించును. అట్టులెందఱిని సంతానముగాఁ బందినను వివాహము లేనిదే జననీజనకులకు మిథునత్వ సిద్ధి లేదు. ఏలన దాని మూలమున నాగరికతా



సంస్కృతు లభ్యుదయమును గాంచనేఱవు.

(ఇ) వంశవిస్తరణప్రయోజనవిరహితమైన కేవల మైథునము మేహ, వ్యా యామములతో సమానము గాన దాని వలనను మిథునత్వసిద్ధి లేదు.

(ఈ) సామాన్యమానవు లెంత పెద్ద ప్రపంచమునకుఁ బరిచితులగుదురో అంతగా హృదయము సెదఱి దారితప్పెదరు. కనుకఁ దఱుచుగాఁ బరిత్యాగ పత్రికలను బంది యంతయే తఱుచుగాఁ జేసికొను పెండ్లిండ్లు ప్రభుత్వా మోదము గల మాఱుపేరిటి విశృంఖలతయే గాని దానివలన సైతము మిథు నత్వసిద్ధి మృగ్యము.

సూత్రము – 55 : నీతి కొజ్జబంతి.

**వృత్తి :** పెండ్లి నీతిమయ జీవనమున కొఱవడి దిద్దును.

(అ) మానవుని హృదయకోశ తర్కమునకును, సుదూర భవిష్యము కొఱ కైన సామూహిక స్వార్థమునకును నీతి యని పేరు. ఇది దేశకాలములను, నామరూపాది ద్వంద్వములను బాటించుట ద్వారా యభివ్యక్తమగును. ఇది బుద్ధికృత తర్కమున కంటె భిన్నమైనది. ఏలన, నిది యనుభూతి పూర్వక మైన యిష్టానిష్టములకు సంబంధించినది.

(ఆ) మానవుఁడు స్మృతిజీవి అయినప్పుడే నీతిజీవి కూడ అయినాఁడు. జ్ఞాపకశక్తి లేనివారును, లేనియట్లు నటించువారును నీతిమంతులుగా నుండఁజాలరు.

(ఇ) జన్యుస్మృతి, శృంఖలాస్మృతి, రేఖేయస్మృతి యని జ్ఞాపకశక్తి మూఁడు విధములు. వీనిలో మొదటిదైన జన్యుస్మృతి జీవజాలపు శరీరముల యందు నిబిడమై యుండును. రెండవదైన శృంఖలాస్మృతి జీవుల మెదళ్ళయందు

ముద్రితమగుచేుండును. ఒక స్మృతి నుండి వేరొక స్మృతికి గొలుసువలె అల్లిబిల్లిగా నల్లికొనుచుఁ బ్రయాణించేుటచే దీనికి శృంఖలాస్మృతిగా నామ కరణము. దీనినే వాసనాస్మృతి యనియుఁ బిలువవచ్చును. రేఖీయస్మృతి యనఁగా యంత్రములకుఁ గల జ్ఞాపకశక్తి. నీతి యనునది శృంఖలాస్మృతికి సంబంధించినది.

(ఈ) నీతి స్వతహాగాఁ దానొక పరిమితి యగుట వలన దానిని సంకుచిత సమాజములలోఁ బాటించేుట సులభము. అది నిగ్రహముతోడను, ఓర్పు తోడను, ద్యాగబుద్ధి తోడను సన్నిహితముగా ముడిపడి యున్నది. క్రొత్త వారిని బరిమితముగాఁ దన జీవితములోని కాహ్వానించేుట ద్వారమున పై లక్షణములను వివాహపూర్వకమైన కుటుంబజీవనము పెంపొందించేును.

(ఉ) వ్యష్టినీతి, సమష్టినీతి యని నీతి స్థూలముగా రెండు విధములు. వీనిలో వ్యష్టినీతి–శృంగారనీతి, వృత్తివ్యాపారనీతి, ధార్మికనీతి యని మూఁడు విధములు. సమష్టినీతి మట్టుకు – కుటుంబనీతి, సంఘనీతి, రాజనీతి, దివ్యనీతి, ప్రకృతినీతి యని ఐదు విధములు. పెండ్లి లేకుండ వీనిలో నే యొక్కదానినైన శాశ్వత ప్రాతిపదికమున నిలఁబెట్టుట గాని, యాకళించేు కొనుట గాని దుర్ఘటములు.

సూత్రము – 56 : **ఒక మతధార్మికోత్సవము.**

**వృత్తి :** భగవంతునియందును, బాపపుణ్యములందును, వాని ఫలితము లందును, ఆముష్మిక జీవితమునందును నమ్మకము గలవా రేదిటి విజనుస్సు తోడి సహజీవనమును మొదలుపెట్టుటకు ముందు నిర్వహించే బాహాట వేఁడుకయే పెండ్లి.

(అ) ఆంతరంగికముగాఁ దమకుఁ దామేర్పఱచేుకొన్నవాని యెడ మానవు లకు నైసర్గికముగాఁ జిన్నచేూపు లావు. వాని నిష్టానుసారముగా మార్చుట



కున్ను, రద్దుసేయుటకున్ను, లేదని త్రోసిపుచ్చుటకున్ను వారు సంకోచిం పరు. భగవంతుఁ డొసంగిన శరీరము, జాతి, కుటుంబము మున్నగువానిని మార్చుకొనను వారికి శక్తిచాలదు. కావున నట్టివానిని నిర్బంధముగా గారవించి ప్రేమింతురు. అట్లే బాహాటముగా జేఱిగిన విషయముల యాథార్థ్యమును దోసిపుచ్చేఁజాలు తెగువయు వారికుండదు. కనుక భగవత్సన్నిధానములో బంధుమిత్త్రాది పరిచిత పరివార సమక్షమున జేఱిగిన పెండ్లి యను ప్రేమ వాగ్దానమును కప్పిపుచ్చి విచ్చలవిడి వర్తనమునకుఁ గడంగుట లోకాపవాద మునకున్ను, దైవాగ్రహమునకున్ను దారితీయునను వెఱపున వివాహితులు జాగరూకతతో మెలంగుదురు. వారిలో నీ విధమైన పరస్పర బాధ్యతా భావ మును గలిగించేుటయే పెండ్లిప్రయోజనము.

(ఆ) తమ జోక్యము లేకయే తమకు సంక్రమించిన తల్లి, తండ్రి, అన్న, తమ్ముఁడు మున్నగు సంబంధములను దైవదత్తములుగా నెంచి జనమే విధముగా నైతే గారవించేుచున్నారో, అట్లే తమ స్వసంకల్పానుసారముగాఁ దామెంచేుకొన్న యర్ధాంగమును సహితము దైవదత్తముగాను, దమ యునికి లో నొక యవిభాజ్యభాగముగాను అంగీకరించి, శాశ్వతస్థానమిచ్చి నిర్ణిబంధ ముగాఁ బ్రేమించెదమని సూచించేుటకే పెండ్లివేఁడుక.

(ఇ) కనుక పెండ్లి యిఱువుఱి యిష్టానిష్టములతో జేఱుగు వ్యవహారమైన ప్పటికిన్ని, దేశకాలప్రభావరీత్యా అది కేవలమా యిఱువుఱికే పరిమితమైన వ్యవహారము మాత్రము కాదు. అట్టి యనుకోలు పెండ్లి నిష్ప్రయోజనమని భావించుటతో సమానమగును.

(ఈ) పెండ్లి యొక ప్రేమవాగ్దానము గనుక నా వాగ్దానమును బాలించే నిమిత్తము పరస్త్రీపురుషులకు దూరముగా నుండవలసి యుండును. ఇట్టి యింద్రియ నిగ్రహమునకు సాధారణ లౌకిక దృష్టి నుండి యెట్టి ప్రయోజన

మున్ను లేదు. కాని పారలౌకిక జీవితమునకిది సహాయకారి యని ప్రాచీన గ్రంథములు తెలుపుచేన్నవి. కనుకఁ బెండ్లి ప్రధానముగా నొక యాధ్యాత్మిక శిక్షణారంభము మాత్రమే.

(ఉ) కనుక దైవమునందును, మరణానంతర జీవితమునందును, బాప పుణ్యముల యందును, దన్మూలకముగా నాత్మశుద్ధిని సాధించుట యందు ను విశ్వాసము లేనివారికిని, బరంపరాగతముల యెడఁ బట్టింపులు లేని అప్రేమికులకున్ను పెండ్లి పెద్దగా నుపయుక్తము కాదు.

సూత్రము – 57 : **మగవారికి లోకముఖ పరిచయమున్ను, మగువల కలౌకిక జీవనాంకురమున్ను.**

**వృత్తి :** పెండ్లితో మగవారు ప్రాపంచిక జీవనములోని కడుగుఁబెట్టెదరు. ఆఁడువా రాధ్యాత్మిక జీవనమునందుఁ బ్రవేశించెదరు.

(అ) ప్రాపంచిక జీవనమనఁగా యోగక్షేమాదిక నిర్వహణము. యోగ మనఁగా సంపాదించుట. క్షేమమనఁగా సంపాదించినదానిని రక్షించుకొనుట. పెండ్లి లేనిచో నీ పనుల కావశ్యకమగు మానసిక ప్రేరణము కలుగదు. తన విషయమును దాను జూచుకొనలేనివాఁ డితరులకు సైత ముపయోగ పడఁడు.

(ఆ) ఇతరుల మనస్సెఱిఁగి మసులుకొనుట పెండ్లి తరువాతనే తెలియును. స్త్రీలు లోకమునకు సూక్ష్మమైన మూర్తరూపములు. వారితో సంపర్కము లేని పురుషులకు సమాజము సమీచీనముగా నర్థమగుటయుఁ గష్టసాధ్యమే.

(ఇ) ఆధ్యాత్మిక జీవన మనఁగాఁ దన శరీరమును మఱియుఁ దత్సంబంధి యగు స్వార్థము నుపేక్షింపఁగల మనోమయస్థితి. పెండ్లితో నాఁడుదానిలో యౌవన మూలకమగు స్వార్థ సుఖలాలస తగ్గి తన మగని కొఱకున్ను, పిల్లల కొఱకున్ను కష్టింపఁగోరు తత్త్వము ప్రబలును. అందఱికిని జెందినవాఁ



డైన పురుషుని సాహచర్యము వలన స్త్రీయందలి వైయక్తిక స్వార్థము కుటుంబ స్వార్థముగా రూపాంతరిల్లి కొంత విశాలత్వమును సంతరించుకొనును. పెండ్లి కాకముందు దర్పణముల వలె నున్న స్త్రీపురుషుల మనఃఫలకములు పెండ్లి తరువాతఁ జిత్రపటముల వలె మారును. ఇది యొక మార్గదర్శక సూత్రము.

(ఈ) స్త్రీలు నైసర్గికముగా సూక్ష్మ విషయాసక్తలు. పురుషులు నైసర్గికముగా స్థూల విషయాసక్తులు. సహజీవనమీ యాసక్తులను బరస్పరముగా మళ్ళింపఁ గలదు.

సూత్రము – 58 : **పిల్లల హక్కుల నిమిత్తము.**

**వృత్తి :** సమాజపు టేకదేశముల పరిధిలోని అధికారమునకు హక్కని సంజ్ఞ. పెండ్లియైన జంటలకుఁ బుట్టిన పిల్లలకు సమాజము వివిధములైన హక్కుల నొసంగును. ఇయ్యవి దేశకాలాధీనములు.

(అ) దీనిని 14 వ సూత్రముతోఁ గలిపి చేదువునది. మానవులలోఁ బారం పర్యభావనకు మిక్కిలి ప్రాధాన్యము కలదు. తమ తల్లిదండ్రులకుఁ జెందిన వారమను భావనయే మానవులలో ననేకాభిమానములకు హేతువు. ఎటు వంటి అభిమానములుండునో అటువంటి హక్కులేర్పడును. ఆ యభిమాన ములు వ్యక్తమైన చరిత్రమును బట్టి ఆ హక్కు లనుభవములోనికి వచ్చేను.

(ఆ) కనుక మానవుల యొక్క యావదభిమానములకున్ను, ఆత్మవిశ్వాస మునకున్ను, హక్కులకున్ను మూలభూతులైన తల్లిదండ్రుల స్థాన మనవద్య మై యుండుట యావశ్యకము.అందునిమిత్తము వారి సామాజికప్రవర్తనపుఁ జరిత్ర నియమనిగ్రహవంతమై యుండుట తప్పనిసరి. పెండ్లి పరస్పర నిబద్ధతకు సంకేతము గనుక పెండ్లియైన జంట నియమనిగ్రహవంతమని సమాజము భావించును. కనుక వారి వారసులను సాక్షాత్తు తన వారసులుగా

నది పరిగణించేను. ఇందుకు విపరీతముగాఁ బెండ్లికానటువంటి జంటలకుఁ బుట్టిన పిల్లలకుఁ బ్రభుత్వము కల్పించిన సామాజిక భద్రత వారి కనీసపు టవసరములను మాత్రమే తీర్పఁగలదు. వారికి రాజకీయహక్కు లున్నప్పటికిన్ని స్వాస్థ్యసంక్రమణము జేఱుగమిఁ జేసి వారార్థికముగా వెనుకఁబడిన వారై వానిని సంతుష్టిగా ననుభవింపఁజాలరు.

(ఇ) హక్కులు తగ్గుట పెక్కు మానసిక వైకల్యములకు హేతువగును. ఏలన, నాత్మాధిక్యభావన గలవారికంటెను ఆత్మన్యూనతాభావన గలవారి వలననే కాలక్రమమున సమాజమునకు ముప్పులు ముప్పేటఁగును. ఏలన వారు సమాజ దేహమున జెబ్బుపడిన అవయవములు. ఆత్మన్యూనతాభావన గలవారాధికారికముగా నేరస్థులని నమోదు కాకపోయినను, వారిలో తప్పులు సేయు ప్రేరణ మెండు. అందుచేత హక్కులు కొఱవడి, దిక్కుదోఁపని జనాభాను విస్తారము సేసికొనుట ప్రజాస్వామ్యమునకే కాక, యే వ్యవస్థకున్ను చిరంతనముగా శ్రేయస్కారి కాదు.

సూత్రము – 59 : **వలయవిస్తారకము.**

**వృత్తి :** పెండ్లి ద్వారమున మానవుఁడు తన పరిచిత పరివారమును, బంధు మిత్రకోటిని బెంపు సేసికొనఁగల్గును.

(అ) మానవులు తమ పూర్వపరిచిత పరివారములతోఁ దనిసి వారినుండియే తమ భాగస్వాములను బరిగ్రహింప మఱుగుదురేని వారి కలిమియు, బలిమియు మాత్రమే కాక జనసంఖ్యయుఁ గాలక్రమమున డిందువడి వారెల్లఱు నంతరించే నవకాశము పెచ్చు. ఏలంటేని, నైనవారినుండి విఱివిగా విలువైన పెండ్లికానుకల లభ్యతయు, నాస్తుల సంక్రమణమున్ను సందేహాస్పదములు. మఱియు మానవులు నైసర్గికమ్మైన యతిరతిలంపటత్వమున జేసియు, ననాదిరక్తకాలుష్యవశమునను, గృత్రిమాహార విహారములాదిగాఁ గల యల



వాటుల మూలమునను బహుదుర్బల రేతస్కులు. కనుక పూర్వపరిచిత పరివారము తోడి పునః పునరావృత్తములైన వివాహసంబంధము లల్పాయుష్కులను, రోగపీడితులను, వికలాంగులను బుట్టించేను గాన వారి వంశముల కొనసాఁక యసంభవము.

(ఆ) కుటుంబమొక రాజకీయ వ్యవస్థయు నగును. జనసహకారము లేని ప్రాబల్యము దుస్సాధము. కనుక దాని నపేక్షించి జన, సత్తాసంపత్తులు గల కుటుంబములతో నందు వియ్యము లధికారాధిక్యమునకు హేతువులగును.

సూత్రము – 60 : **పెక్కుభూమికల యేకత్రాపనము.**

**వృత్తి :** భూమికలనఁగాఁ బాత్రములు. ఏకత్రాపనమనఁగాఁ బెక్కింటి నొక్క చోటనే యుంచేట. మానవుని యెడఁ బలువుఱు నెఱవేఱుపవలసిన విధులు పెండ్లి వలన నొక్క వ్యక్తియందే నిక్షిప్తములగును.

(అ) ప్రతివ్యక్తి యొక్క సమగ్ర మనోవికాసము కొఱకున్ను, యోగక్షేమము లారయుట కొఱకున్ను తల్లి, తండ్రి, గురువు, అన్న, తమ్ముఁడు, అక్క, చెలియలు, నేస్తము, శృంగారప్రేమాస్పదులు, యజమానుడు, రాజే మొదలుగాఁ గల సంబంధములుండుట తప్పనిసరి. కాని మనిషి పెండ్లియ్యైన యానక వీరందఱినిఁ దన యర్థాంగమునందే చూచుకొనవలెను. ఇక్కడ నర్థాంగమనఁగా – భార్యకు భర్త, భర్తకు భార్య.

(ఆ) అనఁగాఁ బెండ్లియ్యైన యానక భర్తకు భార్యయే అక్కయుఁ జెల్లియుఁ దల్లియు నేస్తమును బ్రేయసియు నగును. అట్లే భార్యకున్ను భర్తయే తండ్రియు నన్నయు దమ్ముఁడును నేస్తమును బ్రియుఁడును గురువును, యజమానుఁడును రాజేను అగును.

(ఇ) ఈ పాత్రపోషణము తమవారియం దగోచరమ్మైనప్పుడు జనులు వానిని జనాంతరమునం దన్వేషించేట లోకానుభవసిద్ధము.

(ఈ) ఇది అన్ని వివాహములయందును.

సూత్రము – 61 : **పౌర్వాపర్య మనిర్దేశ్యము.**

**వృత్తి :** ప్రేమము, కామము, పెండ్లి , కుటుంబము అను నీ నాలుఁగింటి లో మొట్టమొదట జేఁబుగవలసిన దిది, తరువాత జేఁబుగవలసిన దిది యని నిర్ధారించి చెప్పుట మత, శాసనేతరములయిన శంసకమాత్ర శాస్త్రములకు వలనుపడదు.

## :: ఐదవ ప్రస్తావనము – కుటుంబతత్త్వము ::

సూత్రము – 62 : **కుటుంబము.**

**వృత్తి :** ఇది యధికారసూత్రము.దీనిఁ దరువాతి యిఱువదిరెండు (22) వెనువెంటి సూత్రముల కనువర్తించుకొనునది.

సూత్రము – 63 : **వంశమునం దేకదేశము.**

**వృత్తి :** ఏకదేశమనఁగా భాగము. ఒక కుటుంబము తన వంశపు సంకెలలో లంకె మాత్రమే. వంశమనఁగాఁ గుటుంబమునకుఁ జెందిన వివిధ పురుషాం తరములలో నేరుగా జన్యజనక సంబంధము గల వ్యక్తుల వరుస.

(అ) నాగరిక జాతులలోఁ గుటుంబముల యొక్క గృహనామముల ద్వార మున వంశమును గుఱుతుపట్టనగును. ఏకరూపమైన గుఱుతింపు నిమిత్త మర్వాచీన పురుషాంతరములవారున్ను అదియే వంశనామముతో వ్యవహృ తులగుదురు. కుటుంబమొక వంశమునందు వక్తకు సమకాలీనమైన మాన కము. పితృప్రాఖ్యము లైన గృహనామముల శైలి పూర్వపురుషులలో నొకానొక ముఖ్యుని యభిజన –విద్యా–వృత్తి–కర్మ–లక్షణాదుల నాశ్రయించి యుం



డును. బహుకొలఁది మాతృప్రాఖ్యజాతులలో మాత్రమిది పూర్వస్త్రీల నను సరించియు నుండును. అనూచానముగాఁ బితృప్రాఖ్యమైన తెలుఁగు జాతిలో నిది వ్యక్తి నామమునకంటెను ముందు వచ్చును. ఉదాహరణము నకు– **తాడేపల్లి లలితాబాలసుబ్రహ్మణ్యము.** పెక్కితర జాతులో నిది విపర్యస్తము. ఉదాహరణమునకు– **లలితాబాలసుబ్రహ్మణ్య ము తాడేపల్లి.** ఒకే వంశమునకుఁ జెందిన వారి నడుమఁ బెండ్లిసంబంధములను నివారించి జాతి నెప్పటికప్పుడు నూత్నరక్తముతో బలశాలినిఁ జేయుటయే వంశనామ ముల ప్రాథమిక ప్రయోజనము. కాలక్రమమునం దిది జాతిచరిత్ర నిర్మాణ మునకు సహితము మిక్కిలి యావశ్యకమైన ప్రధాన సాధనముగాఁ గూడఁ బరిణమించినది. లోకవ్యవహారమున గృహవాచక, వంశవాచకములు ప్రాయి కముగాఁ బర్యాయపదములు.

(ఆ) ప్రథమ కుటుంబమనియు, ద్వితీయ కుటుంబమనియుఁ దృతీయ కుటుంబమనియుఁ గుటుంబము ముత్తెఱఁగులు. ప్రథమకుటుంబమనఁగాఁ దాను పుట్టిపెఱిగినది. ద్వితీయకుటుంబమనఁగాఁ బెండ్లియై తా నేర్ప ఱచుకొన్నది. తృతీయకుటుంబమనఁగా తన ద్వితీయ కుటుంబము వారే ర్పఱచుకొన్నది.

సూత్రము – 64 : **ఒక ప్రేమవ్యవస్థ.**

**వృత్తి :** తాత్పర్యము సుబోధము. దీని నీ ప్రకరణములోని 2 వ సూత్రముతోఁ గలిపి చేదువునది.

(అ) మానవుఁడు కేవల మన్నముతోడనే జీవింపఁజాలఁడు. ప్రేమించుటకు న్ను, ప్రేమింపఁబడుటకున్ను ఆతనికి మనుష్యులు కావలెను. తాను బుట్టిన కుటుంబము గాని, తానేర్పఱచుకొన్న కుటుంబము గాని దాని కుపకరిం చేను. కుటుంబము తన మనుష్యులపై ప్రేమను గల్పించుటే కాక దానిని గుదుఱుగా నిలువఁబెట్టును.

సూత్రము – 65 : **ఒక కామవ్యవస్థ.**

**వృత్తి :** తాత్పర్యము సుబోధము.

(అ) ఎవరితో మిథున ధర్మము నాచరింపవచ్చునో యెవరితో నది కూడదో కుటుంబము బహిరంగమైన యాచారవ్యవహారముల ద్వారమునను, వావి-వరుసల ద్వారమునను బరోక్షముగా శాసించును.

(ఆ) వావి యనఁగాఁ దల్లి, తండ్రి, కొడుకు, కూఁతురు మొదలగు బ్రాథమికమైన ప్రత్యక్ష కుటుంబ సంబంధములు. ఇవి వంశమునం దొక పూర్వమిథునము ననుసరించిన వాచకములు. వరుస యనఁగా వావి ద్వారమున నేర్పడిన వంశసంబంధములు. కాలక్రమములో మిథునములను బట్టి వాచకములే కాక వాచకములను బట్టి మిథునములను నిర్ధారించే పద్ధతియు నేర్పడియె.

(ఇ) వావివరుసలలోఁ గుటుంబవ్యవస్థ యొక భాగమని దీని తాత్పర్యము కాదు. కుటుంబపరిధి విస్తృతతరము. వావివరుసలు మానవుని విజ్ఞానమయ జీవితమునకుఁ జిహ్నములు. ఆతఁడజ్ఞానిగా నున్న కాలమునందు సైత మతనికిఁ గుటుంబముండెను. ఆత్యంతిక స్థితులక్కవిధముగానే యుండు నని గమనించేనది.

(ఈ) ప్రాయికముగాఁ బెండ్లయిన మానవ స్త్రీపురుషులనే కుటుంబ వ్యవస్థ తన సభ్యజేంటలుగా స్వీకరించేను. సరస సల్లాపముల కొఱకున్ను, దాంపత్య ధర్మమునకున్ను, వారిని మాత్రమే యనుమతించేను.

(ఉ) ఇప్పుడు ప్రపంచమునం దన్ని కుటుంబములలోను బాక్షికముగానో, పూర్తిగానో యెంతయో కొంత సూటి రక్తసంబంధము గల స్త్రీపురుషులందఱి నడుమ సమాగమము నిషిద్ధమై యున్నది. ఇయ్యది దేశకాలాపేక్షాద్యధీనము. కనుకఁ బ్రతి నూతన మిథునభావమున్ను క్రొత్త వరుసలకు నాంది యగును.



సూత్రము – 66 : **ఒక ధార్మిక వ్యవస్థ.**

**వృత్తి :** కుటుంబ మొక యాధ్యాత్మిక మత వ్యవస్థ.

(అ) మతమున్ను, మఱియు దాని సంబంధమైన నీతినిగ్రహములున్ను సాధుసన్న్యాసుల ద్వారమునఁ గాక పెండ్లియైన స్త్రీపురుషజేంట లేర్పఱచుకొన్న కుటుంబముల ద్వారముననే వ్యాప్తి నెందును. ఇల్లువాఁకిళ్ళును, పెండ్లాము-బిడ్డలున్ను లేని సాధుసన్న్యాసులకు సహితము తమతమ కన్న తల్లిదండ్రులు కలరనియు, వీరు దశాబ్దముల తరబడి వారి శిక్షణమునఁ బెఱిగినవారే యనియు గమనించేనది.

(ఆ) తండ్రిలక్షణములు లేని దేవుఁడు గాని, ప్రభుత్వము గాని, అట్లే తల్లి లక్షణములు లేని ప్రకృతి గాని, సమాజము గాని యూహాతీతములు.అట్టి విశ్వజనీనమైన మాతాపితృతత్త్వము సన్నిహితముగా నవగతము కావలెనన్నచోఁ గుటుంబజీవనము తప్పనిసరి.

(ఇ) సామాజిక, నైతిక విలువల యందు హెచ్చుపాలు కృతజ్ఞతా భావమును మఱియుఁ బ్రత్యుపకార సూత్రమును ఆశ్రయించి యున్నవి. దానిని స్వీయ కుటుంబము ద్వారమునఁ గాకుండ మఱియొక విధముగా నేర్చుట వీలు పడదు.

సూత్రము – 67 : **ఒక విద్యావ్యవస్థ.**

**వృత్తి :** తాత్పర్యము సుబోధము.

(అ) మానవుఁడు పుట్టినప్పు డాతని మెదడు శుభ్రమైన పలక వంటిది. తన నెవ్వఱు పెంచిరో వారే తన యాప్తులని యాతఁడు భావించేను. వారి నాతఁడు నమ్మదలఁచును గనుక నమ్మును. వారి వాక్చేష్టాదికములే యాతని మెదటి పలక మీఁది మొదటి ముద్రలు. సాధారణముగా నెవ్వ ఱాతనిఁ

గందురో వారే యాతనిని బెంచెదరు. తమ తల్లిదండ్రులు తమను బెంచిరి కను కఁ దామును ఆతనిని బెంచెదరు. ఈ పెంపకపు టాచార మిట్లానువంశిక మగును.

(ఆ) ఏది తెలిసికొనవలె నన్నను ఆ సమాచారమునకు విశ్వసనీయత యవ సరము. లేనిచో మనిషి కభద్రతాభావము కలుగును. విశ్వసనీయుల ద్వార మున నందఁజేయఁబడు సమాచారమునకు విశ్వసనీయత ప్రగాఢము. ఇంత కు ముందు చెప్పిన కారణముచేఁ దన తల్లిదండ్రులున్ను, మఱియు వారి ద్వారమున నితర కుటుంబ సభ్యులున్ను మానవుని కత్యంత విశ్వసనీ యు లు. అందువలన నాతని జ్ఞానమునకు వా రుత్తమ వాహకములుగాఁ బనికి వచ్చెదరు. వారి ద్వారముననే రాజ్య మాతనిని దన కాజన్మ విధేయుఁడుగాఁ జేసికొనఁగలదు.

(ఇ) మానవీయమైన సమస్త విజ్ఞాన, విశారదత్వములున్ను శబ్దమయములు. ఆ శబ్దపరిజ్ఞానమునకుఁ దొలుదొల్తటి యాచార్యపీఠము కుటుంబము.

(ఈ) శాసనబద్ధత్వము దేశభక్తిమూలకము. దేశభక్తి జాతీయతాధారితము. జాతీయత భాషా, ప్రాంత,రక్త, మతాదికాశ్రితము. వానిఁ గూర్చిన పరి జ్ఞానమునకుఁ బ్రథమగురువులు తల్లిదండ్రులు. వారు కుటుంబ సముత్ప న్నులు. కనుకఁ గుటుంబవ్యవస్థయే ప్రభుత్వముల మనుగడకు జీవగఱ్ఱ.

సూత్రము – 68 : **ఒక యార్థిక వ్యవస్థ.**

**వృత్తి :** తాత్పర్యము సుబోధము.

(అ) అనునిత్యమున్ను కుటుంబ నిర్వహణ నిమిత్త మయి రాఁబడి కావలసి యుండును. కుటుంబపు భావిభద్రతకై మదుపులు పెట్టవలసి యుండును. కుటుంబప్రతిష్ఠ యినుమడించుటకై సమశీలశ్రుతయుతులతోఁ గాని,



తమకంటె ధనికులతోఁ గాని సఖ్యమున్ను, వివాహమున్ను కలుపవలసి యుం డును. కుటుంబసభ్యులకుఁ గుటుంబపు టాదాయమునందును, ఆస్తి యందును వాటాలుండును. ఈ యెల్ల కార్యకలాపమునఁ బెట్టుబడి, లాభనష్టములు, యజమానసేవకులు, పోష్యపోషకులు నను లెక్కలుండును.

సూత్రము – 69 : **స్వంత భూభాగము లేని రాజకీయ వ్యవస్థ.**

**వృత్తి :** తాత్పర్యము సుబోధము.

(అ) ఇతరుల కంటెఁ దానొక మెట్టు పైనుండవలెనను నాధిపత్య వాంఛయే రాజకీయ జీవితమున కారంభబిందువు. కాని యీ తత్త్వము రాజకీయ రంగమునందే కాక యెల్ల యితరరంగములందును గలదు. కనుక యీ తత్త్వమున్నవారందఱున్ను ఎంతయోకొంత రాజకీయవాదులనియే చెప్ప వచ్చును. ఇది భార్యాభర్తల మధ్య సైతము కలుగవచ్చును. కాని సాధారణ ముగా స్త్రీపురుషోచితమైన శ్రమవిభజనము ద్వారమునను, మఱియు నాచార వ్యవహారముల ద్వారమునను వారి మధ్య బహిరంగ హింసాత్మక ఘర్షణము నివారింపఁబడును. కాని యా వాంఛను వారు తమ పిల్లలకు బదలాయిం చెదరు. చదువులలోను, ఆటలలోను, గళా నైపుణ్యాదుల లోను దోడి పిల్ల లను మించవలెనను కోరికను వారిలో రగిలించుట ద్వారా తల్లిదండ్రులు వారిని రాజకీయజీవులుగా మార్చెదరు. దీనిని రాజకీయకరణమనవచ్చును. దీనికిఁ గుటుంబమే ఘటికాస్థానము.

(ఆ) రాజ్యమునందు వలెనె కుటుంబమునందు సైతము బలవంతులదే యాధిపత్యము. ఆ బలస్వభావము దేశకాలాధీనము.

(ఇ) రాజ్యమునందుఁ గుటుంబ మొక భాగము కాదు. అందుకు భిన్నముగా రాజ్యవ్యవస్థయే కుటుంబమునం దొక భాగము. ఒక భూభాగము లేకుండ రాజ్యము మనఁజాలదు. కాని కుటుంబము మట్టుకు మనఁగలదు. రాజ్య

వ్యవస్థ పుట్టుటకు ముందే కుటుంబవ్యవస్థ యుండెను. విస్తరించిన కుటుంబమే రాజ్యమయ్యెను. నేటి రాజ్యమునందుఁ బరిపాలనవిభాగముల పేరిట నున్నవన్నియు నాదిమ కుటుంబమునందే బీజప్రాయముగా నున్నవి.

(ఈ) ప్రజాస్వామ్యమునందు రాజ్యము కుటుంబము కొఱకే గాని కుటుంబము రాజ్యము కొఱకుఁ గాదు.

(ఉ) రాజకీయపరిపాలనవ్యవస్థకు వలెనె కుటుంబమునకు సైతమొక నాయకత్వ మవసరము. కౌటుంబిక నాయకత్వమున కావశ్యకమైన లక్షణములు దేశకాలాధీనములు.

(ఊ) కుటుంబమున కెల్లప్పుడును గుటుంబ పెద్దయే సర్వాధికారి. కుటుంబ రాజ్యమునకుఁ గుటుంబపెద్దయే యార్థిక శాఖ, రక్షణ శాఖ, న్యాయశాఖ, భటవ్యవస్థ కూడ.

(ఋ) ఒక కుటుంబమున కొక్కఁటికంటె హెచ్చుమంది పెద్దలుండుటయుఁ గద్దు. ఈ పెద్దఱికముత్తరోత్తరమంతకంటెఁ బిన్నలైనవారికి లింగనిరపేక్షముగా వయోజ్యేష్ఠత్వ ప్రాతిపదికమున సంక్రమించేను.

(ౠ) కుటుంబమునకు రాజ్యాది ఇతరేతర వ్యవస్థలు విదేశ ప్రాయములు.

సూత్రము – 70 : **ఒక రక్షణవ్యవస్థ.**

**వృత్తి :** తాత్పర్యము సుబోధము.

(అ) జీవులు గుంపుగా నున్నప్పుడు వాని బలము హెచ్చును. మానవులిందుకు మినహాయింపు కారు. బలమెక్కువగును గనుక గుంపులోని ఒక్కొక్క విడి వ్యక్తికిని గాఁపుదల స్థాయి సైత మినుమడించేను. కుటుంబము కూడ నొక గుంపు కనుక నది తన సభ్యులకు వలసిన ప్రాథమిక రక్షణమును గల్పించేను.



(ఆ) రక్షణమనేక విధములు. ఆఁకలి, రోగము, వృద్ధాప్యము, గడనలేమి, ఒంటరితనముచే మనోవైకల్యము, స్త్రీలకున్ను, పిల్లలకున్ను, బలహీనులకున్ను కుటుంబేతరులగు నాగంతుకుల వలన బెడద – ఈ మున్నగువాని నుండి కాఁపుదల మానవులకుఁ బ్రాథమికమైన యత్యావశ్యకత.

సూత్రము – 71 : **సంస్కృతీకరణము.**

**వృత్తి :** సంస్కృతి యనఁగాఁ దరతరములుగా నొక జాతిజనులలో వర్ధిల్లిన విరుద్ధాంశ సమన్వయపూర్వకమైన జీవనకళయు నాలోచనాధారయు. కుటుంబము తమ జాతి యొక్క సంస్కృతిని తన సభ్యులకు సంక్రమింపఁ జేయు వాహకము.

(ఆ) చేదువుసంధ్యలతో నిమిత్తము లేకుండ మానవులందఱిలోను నిసర్గచ్ఛాందసము కొంత యుండును. ఇది పెద్దలలోఁ గంటెఁ బిన్నలలో జాస్తి. పెద్దవయస్సునందలి ఛాందసమునకు సైతము పిన్నవయస్సునందలి ఛాందసమే కారణము. అనఁగాఁ దామే వాతావరణములోఁ బుట్టిపెఱిగిరో అందలి పద్ధతులున్ను, విషయములే ధ్రువములనియు, సమంజసములని యుఁ జిఱుత వయస్కులు నమ్మెదరు. పెద్దలపట్లఁ బిన్నలు నమ్మకముంచి వారి నడత నుండి నేర్చుకొందురు. వారిలో నా నమ్మక మట్టులే యాజీవనమున్ను కొనసాఁగు సంభావ్యతయుఁ గలదు. కనుక వారట్టి నమ్మకముతోడనే తమకు సంక్రమించిన జీవనవిధానమును యథాతథముగాఁ బరిరక్షింపఁ బూనుకొందురు. ఈ రకమైన జీవనవిధానాభిమానమే సంస్కృతీకరణము.

(ఆ) మానవులు తాము పుట్టిపెఱుఁగు క్రమములో సంస్కృతీకరణము, సామాజికీకరణము, రాజకీయకరణము, నని మూఁడు ప్రభావాలకు లోనగుదురు. వీనిలో నత్యంత ప్రముఖమైనది సంస్కృతీకరణము. ఇది సమీచీనముగా లేదేని, మఱిప్రభావములెంత గాఢములైనను అవి యంతిమముగా

సానుకూల ఫలితముల నొసంగఁజాలవు.

సూత్రము – 72 : **జలగతిప్రేమముఁ గలిగినది.**

**వృత్తి :** కుటుంబసభ్యుల ప్రేమము నీటివలెఁ బైనుండి క్రిందికిఁ బ్రవహించును. అనఁగాఁ గుటుంబమునందు ముందుగాఁ బ్రేమమును జూపవలసినది అందలి వయోవరిష్ఠులే.

(అ) మచ్చునకు – భర్త భార్యమీఁదను, ఆ భార్య పిల్లల మీఁదను, ఆ పిల్లలు తమ పిల్లల మీఁదను అవరోహణక్రమమునఁ బ్రేమాదరములను జూపవలసియుండును. పిన్నలు తమ పెద్దలయెడఁ బ్రేమము సూపనక్కఱలేదని దీని తాత్పర్యము కాదు. కాని, నీరు క్రిందికే గాని పైకిఁ బ్రవహింపని విధముగాఁ బ్రేమమునకు బదులుగాఁ బ్రేమమును దిరిగిపొందుట కుటుంబపెద్దలకు ముఖ్యాంశము కాదని భావము.

(ఆ) దీనిని 51 వ సూత్రపు వృత్తిలో (ఉ) అను గద్యతోఁ గలిపి చేదువునది. కుటుంబపు టునికికి మూలభూతమైన ప్రేమమునకుఁ బెద్దలు సజీవదృష్టాంతములుగా నున్నచోఁ దరువాతి తరములందు సహితము వారి కుటుంబ సంప్రదాయములు సుస్థిరముగా నిలువఁబడును. ద్వేష్యులగు పెద్దలతోఁ బాటు వారి సంప్రదాయములు సహిత మర్వాచీనులకు ద్వేష్యములగును. ఇది యొక మార్గదర్శక సూత్రము.

సూత్రము–73: **అమూర్తద్వంద్వములకు మూర్తప్రాతినిధ్యము.**

**వృత్తి :** మానవసంబంధములను గూర్చియు వాని పరిమితులను గూర్చియు స్పష్టతలేని విభిన్నమనోభావములకు సంపూర్ణ కుటుంబనిర్మాణము వికసితరూపము నేర్పఱచుచుఁ బ్రతినిధిల్లును.

(అ) కుటుంబవ్యవస్థ యింకను బూర్తిగా నేర్పడని దశలోను, అది విచ్ఛిన్న



మగుచున్న దశలోను మానవబాంధవ్యముల స్వరూప–స్వభావ–విధ్యుక్తములను గుఱించిన స్పృహ యిదమిత్థమని నిర్ధారింప వలనుపడని విధముగా ద్రవస్థితిలో నుండును. అనుష్ఠానమున బాంధవ్యము భావనమును బట్టియే. భావనము వాస్తవజీవనమును బట్టియే. అది యెట్లంటేనిఁ గనక పోయినను బెంచిన హేతువుచేతఁ దల్లిదండ్రులు కావచ్చును. కడుపారఁ గన్నను బెంపమిఁ జేసి తల్లిదండ్రులు గాకపోవచ్చును. తల్లిదండ్రులని తెలియుట గాని, దెలియమి గాని యిచ్చటఁ బ్రభావకములు కావు. భావనములు నైసర్గికముగా నస్పష్టములున్ను క్షణికములున్ను. ఒక్క వ్యక్తికే మఱియొక వ్యక్తి యెడ వివిధ సందర్భములందు పితృపుత్రమిత్రభర్త్రాది వివిధ భావనములు కలుగవచ్చును. వ్యవస్థీకృతమైన కుటుంబమునందలి పూర్వ నమూనాపాత్రముల సహాయముతో మనుష్యులా భావములను వ్యక్తివిశిష్టముగా స్థిరీకరించుకొనుట నభ్యసించెదరు. అనఁగా నొక్కొక్క ప్రత్యేక వ్యక్తి నొక్కొక్క కేటాయిత పాత్రమునకే పరిమితించుట కలవడెదరు.

(ఆ) కాఁబట్టి కుటుంబవ్యవస్థ సర్వలక్షణ సమన్వితముగా నేర్పడిన యానక అందలి భార్య, భర్త, తల్లి, తండ్రి, అన్న, అక్క, తమ్ముఁడు, చెలియలు, కొడుకు, కూఁతురు మొదలగు వావులు సామాన్యసంబోధనమాత్రములు కాక యాదర్శవంతములైన సాంస్కృతిక పాత్రములున్ను అయియున్నవి. అక్కారణముచేత నొకప్పుడు సూక్ష్మమైన ప్రత్యక్షసమాజమునందు మొదలైన యీ పిలుపులు – ఆ కుటుంబమే నూఱులుగా, వేలుగా, లక్షలుగాఁ గోటులాదిగా విస్తరించి పరోక్ష సమాజముగాఁ బరిణమించిన తరువాతఁ గూడ మానవుల నడుమ నొండొరు మన్నింపుల కొఱవడియై అప్పసము నిలువఁబడినవి.

(ఇ) కుటుంబమొక వ్యవస్థ కనుక నీ యమూర్తభావము లింటి కట్టడపు రూపములోఁ గూడ మూర్తములు కావింపఁబడును. ఉదాహరణమునకు

– దల్లిదండ్రులున్ను, పిల్లలున్ను, పెద్దలున్ను నివసించేట కొక్కయింటిలోనే వేఱువేఱు గదులు కట్టుట మున్నగు చర్యల ద్వారమున వారివారి పాత్రము లున్ను, పరిమితులున్ను ప్రస్ఫుటీకరింపఁబడును. ఇట్టి పాదార్థికములైన వేఱుపాట్లు లేని పట్టులందుఁ బరిమితుల యతిక్రమణము సంభవము.

సూత్రము – 74 : **కిరణ్యతార్థము.**

**వృత్తి :** కిరణ్యత యనఁగాఁ గాంతిప్రసారమునకున్ను తన్మూలకముగా దృష్టిప్రసారమునకున్ను వీలైన పదార్థతత్త్వము. కుటుంబము సామాజిక వ్యవహారములను సకలజన విదితముగా నడుపుకొనుట కొఱకు.

(అ) రహస్యములున్ను, సమాచారాంతరములున్ను గల చోటుల నానావిధములైన అక్రమములున్ను, అపశ్రుతులున్ను ప్రవేశించేను. తండ్రి యెవఁటో తెలియని చోటులందును, దెలియనక్కఱలేని చోటులందును స్త్రీల సుశీలమునకున్ను, సంబంధవాచకములకున్ను విలువ లేదు. కడపటివి త్యాగనిగ్రహాది సుగుణాభ్యాసము కొఱకు.

సూత్రము – 75 : **మానవీకరణార్థము.**

**వృత్తి :** మానవులను మానవీయాలోచనలు గలవారుగా నిలిపి వారిని మానవీకరించే నిమిత్తమే సర్వసభ్య సమన్వితమైన కుటుంబము.

(అ) అనావృతయై అట్లుండ నిశ్చయించేకొన్న మగువకుఁ గుటుంబబాహ్యుఁ డైన మగవాని దృష్టిలోగామోపభోగాస్పదమైన వస్తువుగాఁ గాక తద్భిన్నమగు మూల్యము పూజ్యము. ఆమె కొఱ కాతఁడు శ్రమించేటయు, జీవితము నర్పించేటయుఁ స్వప్నైకవార్త. అట్లే యట్టి మగువ దృష్టిలో మగవాని విలువ రేతోబిందు పరిమాణమునకుఁ గుదింపఁబడును. పరస్పర ప్రాధాన్యము మృగ్యమైన పట్టుల నంతర్గతముగా నిర్దయాత్మకమైన యమానుషత్వము విజృంభించేను. ఆ యమానుషత్వమునే వారి వారసులు సహితము వారసత్వముగాఁ బందెదరు.



(ఆ) ప్రేమరాహిత్యము మనఃకాఠిన్యమునకున్ను, మనఃకాఠిన్య మమానుషత్వమునకున్ను, అమానుషత్వ మనాగరికతకున్ను దారితీయును. కనుకఁ గౌటుంబిక విలువలు లేని సమాజములు, అవి యున్న సమాజముల కంటెఁ గొన్ని శతాబ్దములు గానీ, సహస్రాబ్దములు గానీ వెనుకఁబడి యుండును. ఏలన, నాగరికత మార్దవమును, మార్దవము ప్రతిస్పందనములను, బ్రతిస్పందనము లాలోచనశక్తిని, ఆలోచనశక్తి నాగరికతను అనులోమముగా వృద్ధిఁ బొందించేను.

సూత్రము – 76 : **నెనరునకు స్థాయీభావము.**

**వృత్తి :** నెనరనఁగాఁ గృతజ్ఞత. మానవ నాగరికతలోని క్రమబద్ధత కాధారభూతమైన కృతజ్ఞతాభావమునకుఁ గుటుంబ వాతావరణ మాశ్రయమును గల్పించేను.

(అ) మానవ నాగరికతలోని యెల్ల నీతులకున్ను, సంప్రదాయములకున్ను, చేట్టములకున్ను, నియమ నిబంధనములకున్ను మూలకందమైనది – చేసిన మేలునకున్ను, కీడునకున్ను అంతకంత మాఱుసేయవలెనను భావము. లేదా, మేలుసేసినవారికిఁ గనీసము కీడు సేయక మఱలవలె నను భావము. తన కొఱకు మగఁడు కష్టించేచేన్నాఁడను భావమున మగువయుఁ దన కొఱకు మగువ కష్టించేచున్నదను భావమున మగవాఁడున్ను పరస్పరానురాగబద్ధులై యుండుట సులభము.

(ఆ) అట్లే యా కృతజ్ఞతను మానవశిశువు సైతము మొట్టమొదటఁ దన కుటుంబము నుండియే నేర్చుకొనును. తాను బుట్టినప్పుడు తన నొక యాటంకముగానో, చిత్తవిక్షేపముగానో యెంచి పారవేయక యాప్యాయత

మీఱ ముద్దుసేసి పెంచినందులకుఁ దల్లిదండ్రుల పట్ల గృతజ్ఞత వహించును. వారు తనకు గోచరించిన తొలుదొల్తటి పూజ్యులు కావున నటుపిమ్మట వారి యంశలనే లోకములోని పెద్దలెల్లటి యందును అన్వేషించును. ఆ క్రమములో మాతాపితృస్థానీయములైన స్వదేశము మున్నగువాని పట్ల భక్తిభావము నలవఱచుకొనును. ఈ భావమే రాజ్యమును నిలువఁబెట్టుటకు దోహదకారి.

సూత్రము – 77 : **బాలబాలికలకుఁ బాత్రపోషణ పాఠశాల.**

**వృత్తి** : కుటుంబము నుండి యాఁడుపిల్ల లాఁడుకర్తవ్యములను, మగపిల్ల వాండ్రు మగకర్తవ్యములను నేర్చుకొందురు.

(అ) తిర్యక్కులందు వలె మానవులయందు సహజాత వికాసము ప్రాజ్యము కాదు. కనుక స్త్రీత్వపురుషత్వములతో సహా ప్రతి విషయమును బ్రయత్న పూర్వకముగా సమాజమునుండియే కఱవవలసి యుండును. సాధారణముగా మనిషికిఁ దెలిసిన తొలి సమాజము ప్రత్యక్షసమాజమే, అనఁగాఁ గుటుంబమే. ఒకే యింటిలో మగవారున్ను, ఆడువారున్ను కలిసికట్టుగా నివసించుట తథ్యము. అప్పుడందున్న యాఁడువారి నాఁడుపిల్లలు నమూనా పాత్రలుగాఁ గైకొని యనుసరింతురు. అట్లే మగపిల్లలున్ను తమ కుటుంబమునందలి మగవారిని నమూనాపాత్రలుగాఁ గైకొని యనుసరింతురు. కనుక నా విధముగా స్త్రీత్వ పురుషత్వములను, దత్సంబంధి కర్తవ్యములను జిఱుతతనము నుండి పిల్లల కాచరణాత్మకముగా బయల్పఱచి, వారివారి సహజ ప్రతిభా పాటవములకున్ను, ప్రకృతిప్రసాదిత సహజాతములకున్ను అనురూపముగా, మఱియు నెదిఱి విజనుస్సు యొక్క ప్రయోజనముల కవిరుద్ధముగా వారిని భావివాస్తవజీవనరంగమునకు సంపూర్ణస్థాయిలో సన్నద్ధము సేయునది కుటుంబము.

(ఆ) దీనిని 5వ సూత్రముతోఁ గలిపి పఠించునది. మానవసమాజము



జన్యుద్వారమున నేర్పడినట్టిది కనుక మానవస్త్రీలు మానవస్త్రీజన్యులక్షణముల తోడను, మానవపురుషులు మానవపురుష జన్యులక్షణముల తోడను విలసిల్లుట కూడఁ జాల నావశ్యకము.

సూత్రము – 78 : **పరోక్ష సమాజమునకు భారహ్రాసము.**

**వృత్తి :** భారము తగ్గుట భారహ్రాసము. కుటుంబము వ్యక్తుల బాధ్యతను స్వీకరించుటఁ జేసి పరిసర, పరోక్షసమాజములకు వాని బరువు తగ్గి యంత కంటెను సార్థక్యము గల యుమ్మడి కార్యకలాపములందు వ్యగ్రమగు సావకాశము కలుగును.

(అ) కుటుంబసేవ లమూల్యములు. అనఁగా వెలఁ జెల్లింపనక్కఱ లేనివి మఱియు విలువఁగట్టరానివి. అట్లగుటకుఁ గారణము, కుటుంబసభ్యుల కొండొరుల పట్లఁ గల ప్రేమాభిమానములే. అయినను వాని కొఱకు సైత మెంతయో కొంత వ్యయము కాకతప్పదు. ఆ పాటి స్వల్పవ్యయమును గుటుంబములు శ్రమకోర్చి సంపాదింపఁగలవు. అట్లు వ్యక్తులు వ్యక్తుల కొఱకుచితముగాఁ గష్టింపఁగలరు కాని సమాజము వ్యక్తులకొఱ కుచితముగాఁ గష్టింపఁజాలదు. కనుక నా సేవలనే సమాజములోని కుటుంబేతరవ్యక్తుల చేతఁ జేయింపఁబూనినచో నా వ్యయమున కిబ్బడిముబ్బడిగా వెచ్చమై తడిసి మోపెడగును.

సూత్రము – 79 : **అల్పవ్యయాత్మకము.**

**వృత్తి :** కుటుంబజీవనము తక్కువ వెచ్చము గలది. అనఁగాఁ దనను బ్రేమించు కుటుంబములో నొక భాగమై యుండుట వలన చౌకలో బ్రదుక వచ్చును.

(అ) ఇది తలసరి లెక్కకు సంబంధించిన విషయము. కనుక మొత్తము కుటుంబపోషణమున కగు వ్యయము టోకున హెచ్చుగాఁ గానవచ్చుచు–

న్నను గుటుంబమునందలి యొక్కొక్క సభ్యుని వెచ్చమును విడిగాఁ దీసి కొని గణించినప్పుడు చౌకయే యగును. కష్టించేటకున్ను, రాఁబడికిని సం బంధమున్నది కనుక కుటుంబములో భాగమ్మైనవారు వ్యక్తిగతముగా నెక్కువ కష్టింప నక్కఱలేదు.

(ఆ) 7 వ సూత్రప్రస్తావనములోఁ బ్రత్యక్ష పరోక్ష సమాజములను గుఱించి చెప్పిన విషయమే యీ సూత్రములో ప్రత్యక్షసమాజమునందలి విడివిడి సభ్యుల విషయములోఁ దాఱుమాఱగును.

సూత్రము – 80 : **అల్పప్రయాసాత్మకము.**

**వృత్తి :** కుటుంబజీవనములో నుపమితముగా శ్రమము తక్కువ. ఉపమిత మనఁగాఁ బోల్చిచూచినప్పుడు.

(అ) ఆదర్శప్రాయమ్మైన కుటుంబములో వయస్సు, వావి, నేర్పు మొదలైన నంశముల ననుసరించి యెవఱికి సముచితమ్మైన పనిని వారు చేపట్టుదురు గనుక నందఱున్ను అన్నివేళల నన్నిపనులుఁ జేసికొన నక్కఱలేదు. కనుక వారితరేతరములైన మానసిక, సామాజిక వికాసములను నిర్విచారముగా సాధించేట కనుకూలమగు వాతావరణమేర్పడును.

(ఆ) ముఖ్యముగా బాలబాలికలు, వయోవృద్ధులు, నస్వస్థులు, దుర్బల శరీరులు, వికలాంగులు, నవిద్యావంతులు, నల్పవిద్యావంతులు, లౌక్యమునం దదృష్టులు, మఱియుఁ బెక్కండ్రు స్త్రీలును మిక్కిలి శ్రమింపఁజాలరు కావున వారికిఁ గుటుంబజీవనమునందే క్షేమస్థైర్యధైర్యవిజయ వీర్యములున్ను, ఆయురారోగ్యైశ్వర్యములున్ను సిద్ధించును.

(ఇ) కండ్ల కట్టెదుటఁ గష్టింపఁగల్గినను, లేకున్నను లోకమునందుఁ బరి పూర్ణముగా వ్యర్థులగు వారలొక్కఱున్ను లేరు. అందుచేత నియ్యది గుణమే



గాని దోషమని భావింపరాదు. ఏలన, సమాజములోఁ బెక్కండ్ర ప్రతిభాపాటవ ముల యొక్క సంపూర్ణమూర్తిమత్త్వమున్ను, సార్థక్యమున్ను సద్యోలాభ పర్యవసాయి యగు ధనార్జనరూపమునందుఁ గాక చిరపరిణామక్రమమున నేర్పడఁగల యనుకూల వాతావరణమునందు మాత్రమే తెలియనగును. ఇది యొక మార్గదర్శక సూత్రము.

సూత్రము – 81 : **బహుజనాశ్రయము.**

**వృత్తి :** కుటుంబ మింటిలోనే కాక బయట సహిత మనేకుల కాధారభూతమ్మై యుండును.

(అ) మతములు, వ్యాపారములు, వ్యవస్థలు, రాజకీయములు, రాజస్వము లు మున్నగునవెల్లఁ గుటుంబములను గాని, వాని దైనందినావశ్యకములను గాని పురస్కరించికొనియే నడచేచున్నవి. వానిని నడపుట కవసరమ్మైన మన స్తాత్పర్యము సహితము కుటుంబజీవనము నుండియే ప్రభవించును.

సూత్రము – 82 : **సంపర్కజాల నిర్మాత.**

**వృత్తి :** కుటుంబము మానవసంబంధములనెడి వల నల్లును.

(అ) దీనిని 55 వ సూత్రముతోఁ గలిపి పఠించునది. మానవసంబంధము లనెడి సమాసమొక పునరుక్తిదోషము. కారణము– సంబంధమను మాట మానవులకుఁ దప్ప యింక నే యితరజీవజాతికిని సర్వసమగ్రముగా వర్తించే నట్టిది కాదు. ఏలన, స్మృతి, నీతి, యవసరము, ప్రేమము నను నీ నాలుఁ గంశములే సంబంధముల నల్లును. ఇవి మానవులలోనే వికసించేట కవ కాశము కలదు.

(ఆ) వివాహసంబంధముల ద్వారమున వియ్యములవారితోడను, వియ్య ములవారి ద్వారమున వారి వియ్యంకుల తోడను, అట్లే వారి యొక్క యావ

న్మిత్రమండలితోడను బరిచయమున్ను నెయ్యమున్ను కల్గును. వివాహ సమయబాహ్యులకీ యవకాశము పూర్ణానుస్వారము.

(ఆ) మానవులు తమకుఁ దాము పైయక్తికముగా నేర్పఱచుకొన్న సంబంధ ముల ద్వారముననే కాక తమ పితృపితామహాదులకున్న పురాణమైత్రీబాంధ వ్యముల ద్వారమున సైతము కొన్నియెడల లబ్ధిఁ బందెదరు.

సూత్రము – 83 : **తరునిర్విశేషము.**

**వృత్తి :** తరువనఁగాఁ జెట్టు. కుటుంబమొక చెట్టువంటిది.

(అ) ఒక చెట్టునందుఁ దల్లివేరు, వేరులు, బోదె, కొమ్మలు, ఱెమ్మలు, మం డలు, రెబ్బలు, ఆఁకులు, చిగురులు, పూవులు, మొగ్గలు, పిందెలు, కాయ లు, పండ్లు, నార, జిగురు మున్నగు ననేక భాగములుండును. వానిలో దేని విలక్షణప్రయోజనము దానిదే గాని యొకదాని నింకొకదానితోఁ బ్రతి క్షేపించుట సాధ్యము కాదు. ఏలన, నొకదాని ప్రయోజనమునకు వేఱొక దానితో సరిపుచ్చుకొనుట వీలుపడదు. లేదా, ఒకదాని నింకొక ప్రయోజన మున కుపయోగించుటయు సాధ్యము కాదు. అట్లే కుటుంబమునందలి వివిధ వ్యక్తులున్ను తమతమ సంబంధవాచకముల ననుసరించి తతిమ్మ కుటుంబసభ్యుల కుపయోగపడుదురు. కాని యొకటి పాత్రమును వేఱొక్క ఱెన్నటికిన్ని సంపూర్ణముగా భర్తీ చెయ్యఁజాలరు, ఒకవేళ ఏ కారణముచేతనైన వారందులకు సుముఖులై యున్నప్పటికిన్ని !

(ఆ) ఇచ్చట సాంప్రదాయిక సంబంధవాచకముల ప్రకారమైన వారివారి యుపయోగములే కాక వారి యునికి మానవహృదయమునఁ బ్రేరేచే సంస్కార విశేషమునకున్ను, తదనుభూతికిన్ని మిక్కిలి ప్రాధాన్యము కలదు.

(ఇ) దీనిని 11 వ సూత్రముతోఁ గలిపి పఠించునది. కుటుంబము కూడ



నొక సమాజమే. రాజకీయ, వ్యాపారాది పదవుల నధిష్ఠించువారికిఁ బ్రత్యామ్నా యములున్నవి. కాని కుటుంబసభ్యులలో నే యొక్క వ్యక్తికిని బ్రత్యామ్నా యము లేదు. వారు లేనప్పుడు వారి పాత్రమును గుటుంబము పోషింపఁజా లదు.

సూత్రము – 84 : **మేధాజననము.**

**వృత్తి :** మంచి కుటుంబముండుట వలన మానవుల మేధాశక్తి వృద్ధిఁ బొందు ను. మంచి కుటుంబమనఁగాఁ బరస్పరప్రేమవిశ్వాసపూరితమున్ను, త్యాగ భావనావిలసితమున్ను, గమ్యాగమ్యవివేచనశీలమున్ను అయినట్టిది.

(అ) మేధాశక్తి యనునది క్షేమస్థైర్యములు గల వాతావరణమునం దేఁపు గాఁ బెఱుగును. ప్రేమింపఁబడుటయందే క్షేమము కలదు.కనుక క్షేమము ప్రేమమును, బ్రేమము స్వేచ్ఛను, స్వేచ్ఛ విశ్వాసమును, విశ్వాసము నేర్చు కొను ప్రేరణమును, ఆ ప్రేరణము మేధాశక్తినిఁ గ్రమముగా వృద్ధిఁ బొందిం చునని తాత్పర్యము. ఏలనఁ బ్రాయికముగా మానవులు తామేది నమ్మఁ దలఁతురో దానినే నమ్మెదరు. ఒకటిని నమ్మినఁ గాని వారినుండి నేర్చుకొనఁ జాలరు. కనుక నమ్ముట కొఱకు వారికి విశ్వసనీయులైన వ్యక్తులు కావలెను. చిఱుతతనము నుండి తెలిసినవారే విశ్వసనీయులు కనుకఁ గుటుంబమట్టి విశ్వసనీయులను వారికి సమకూర్చిపెట్టును.

(ఆ) మేధాశక్తి యనునది పెక్కుసందర్భములయందు సామూహికమే గాని పైయక్తికము కాదు. కుటుంబము నెఱుఁగక అడవిలో వన్యమృగముల మధ్య పెఱిగిన పిల్లవాడు నాలుఁగుకాళ్ళతో నడచును. మానవసంఘమునఁ బ్రవేశించినఁ గాని యాతని మేధాశక్తికి సార్థకత లేదు.

(ఇ) కుటుంబము సమాజమునకు సూక్ష్మరూపము. వ్యక్తియు సమాజ

మునకు సూక్ష్మరూపమే. కనుక వ్యక్తిస్థాయిమేధాశక్తి వృద్ధిసెందుటకుఁ గుటుంబస్థాయిభద్రత సరిపోవును. అది యెట్లంటేనిఁ – బ్రపంచమునందు మంచినీటి సముద్రములే యున్నప్పటికిన్ని మనిషి దాహము తీఱుటకొక లోటా సరిపోయినట్లు.

సూత్రము – 85 : **వ్యక్తిప్రభృతు లుత్తరోత్తరము మహీయములు.**

**వృత్తి :** వ్యక్తి–పక్ష ము–ప్రభుత్వము– శాసనము–రాజ్యాంగము – దేశము–సమాజము–కుటుంబము అను నెనిమిది స్వమూర్తులలో నొక్కొక్క తొలి స్వమూర్తి కంటెను ఒక్కొక్క మలి స్వమూర్తికిఁ బ్రాముఖ్యము మెండు.

(ఆ) ఇటఁ బక్షమనఁగా రాజకీయపక్షముగానీ, తదితర సంఘములు గానీ. ప్రభుత్వమనఁగాఁ బ్రస్తుత పరిపాలకవర్గము. శాసనమనఁగాఁ జేట్టమున్ను, నియమనిబంధనలున్ను. రాజ్యాంగమనఁగా రాజ్యాంగహృదయము. అనఁగా దానిని రచింపను గారణములైన చారిత్రికప్రేరణములున్ను ఉద్దేశములున్ను. దేశమనఁగాఁ దమ బంధుమిత్రులకంటెను వేఱైన ప్రజలు. సమాజమనఁగా యావన్మానవజాతి. ఇక్కడ 4 వ సూత్రమును స్మరించేనది. కుటుంబమనఁ గాఁ గుటుంబవ్యవస్థ. ఇది 6 వ సూత్రవృత్తితో ననుసంధేయము. ఒక వ్యవస్థ యందు దాని విడిమానకము లేకదేశమాత్రములు.

(అ) అనఁగా–ఒక వ్యక్తి కంటెను, లేదా అట్టి వ్యక్తుల సమూహముల కంటెను వారు సభ్యులుగా నున్న రాజకీయపక్షమే ముఖ్యము. రాజకీయపక్షమున కంటెను బరిపాలనమే ముఖ్యము. ప్రస్తుతప్రభుత్వమున కంటెను బూర్వశాసనములే ముఖ్యము. ప్రాక్ఛాసనముల కంటెను రాజ్యాంగహృదయమే ముఖ్యము. రాజ్యాంగమున కంటెను దేశమే ముఖ్యము. దేశమున కంటెను సమాజమే ముఖ్యము. సమాజమున కంటెను గుటుంబవ్యవస్థయే ముఖ్యము. ఎందుకంటేని, సరియైన కుటుంబవ్యవస్థ యేర్పడినచోట సరియైన పరోక్ష



సమాజము మున్నగు నుపరితలవ్యవస్థలు కాలక్రమమునఁ దమ యంత తామే యేర్పడఁగలవు. ఏతద్విపర్యయము నూహించేనది.

(ఇ) సరియైన కుటుంబవ్యవస్థ ద్వారముననే సరియైన వ్యక్తులు రూపు దిద్దుకొందురు. కాని సమాజములో సరియైన వ్యక్తులున్నంతమాత్రముచే తనే వారి ద్వారమున సరియైన కుటుంబవ్యవస్థ యేర్పడకపోవచ్చును. ఎందుకంటేని, నెంతటి మేధావులైనను మానవులు పెక్కండ్రు పెక్కు పూర్వ వ్యవస్థల కనుయాయులే తప్ప వానికి స్రష్టలు కాఁజాలరు. కాన నంతకు ముందు లేనిదటువిమ్మట వెనువెంటనే యేర్పడుట కడిఁది. వ్యవస్థలు సద్యోజాతములు గాక బహుదీర్ఘచరిత్రపరిణామప్రవర్ధితములు. కనుక వాని నర్థాంతరపుఁ దెంపులేని విధముగాఁ బ్రతిపురుషాంతరమునందును యథాపూర్వముగాఁ గొనసాఁగించేట విధాయకము. ఎంత చిన్న సంప్రదాయమును భావిపురుషాంతరముల కందింపవలెనన్నను, గొనసాఁగింపవలెనన్నను సర్వసభ్యసమన్వితమైన కుటుంబము మినహాఁ పిల్లలకు విశ్వసనీయమైన వాహకము వేఱొకటి లేదు.

(ఈ) ఇది వ్యవస్థలను దూరదృష్టితో నిర్మించుకొను పద్ధతిఁ గుఱించిన మార్గదర్శకసూత్రము మాత్రమే. విడిఘటనలు ప్రకరణప్రతియోగిగా వ్యవహరణీయములు.

---

: ప్రకరణాంత గద్య :

ఇది సకలసూరిసమ్మతిపాత్ర, హరితసగోత్రపవిత్ర, శ్రీతాడేపల్లి భానుమతీ వెంకటేశ్వర పుణ్యమిథున తృతీయపుత్త్ర, శ్రీషిరిడీసాయి–లలితా మహామాత్ృ నిర్ణిబంధ కృపాకటాక్ష వీక్షణైక సంపద్యమాన బహుభారతీగాత్ర, లలితాబాలసుబ్రహ్మణ్యము రచించిన మందిమన్నియమను నభినవ రాజనీతితంత్రమునందుఁ గౌటుంబికాఖ్యమగు మూఁడవ ప్రకరణము.